# సత్య హరిశ్చంద్ర

(5 అంకముల నాటకము)

గ్రంథకర్తలు:

## రామ నారాయణ కవులు

ప్రకాశకుడు:

## కనుపర్తి కోటయ్య పంతులు,

బుక్‌సెల్లర్, తెనాలి.

తెనాలి
ది ఇలస్ట్రేటెడ్ ప్రింటింగు వర్క్సుయందు,
వ. జగన్నాథ శాస్త్రిగారిచే
ముద్రింపబడినది.

1926.

# పాత్రలు

ఇంద్రుడు
బృహస్పతి
నారదుడు
వసిష్ఠుడు
విశ్వామిత్రుడు
హరిశ్చంద్రుడు
సత్యకీర్తి
1 పౌరుడు
2 పౌరుడు
చంద్రమతి
లోహితాస్యుడు
1 మాతంగకన్య
2 మాతంగకన్య
నక్షత్రకుడు
దంతఘాతుకుడు
కలహకంఠి
కాలకౌశికుడు
వీరబాహుడు
1 బాలుడు
2 బాలుడు
పరమేశ్వరుడు



# సత్యహరిశ్చంద్ర

## ప్రథమాంకము

రంగము :— (దేవలోకము :—ఇంద్రసభ :—చింతామణీపీఠమున నింద్రుడును, బృహస్పతి, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు నారదుడు, అగస్త్యుడు, మొదలగు మునులును ప్రవేశించుచున్నారు.)

ఇంద్ర—(బృహస్పతినిఁ జూచి) దేవగురువర్యా! వ్రతములన్నిటిలో నుత్తమమైన వ్రతమెద్దియో యానతిచ్చెదరా?

బృహ—పాకశాసనా! క్రతువులకంటె, దానధర్మములకంటె, తీర్థయాత్రలకంటె, తపముకంటె మహోత్తమమైనది సూనృతవ్రతము.

ఇంద్ర—నాచిత్తమునకు సర్లె తోచినది. (మునులఁజూచి) మునిపుంగవులారా!

ఆ॥ మౌనులార స్వర్గ • మర్త్యపాతాళ లో
కములయందు మీరు • గన్గొనని నృ
పాలు రెందులేరు • పరికింపఁ గావున
వలయు నడుగ నొక్క • పలుకు మిమ్ము.

క॥ త్రిభువనములయందును భూ
త భవిష్యద్వర్తమాన • ధరణీశులలో

సభిమత సూనృతవాచా
విభవసమగ్రుండు గలఁడె • వివరింపంగన్ •

సర్వలోకైకమాన్యుఁడై పొలుచునట్టి రాజన్యుఁడుండెనేని వచి యించి నాడెందమున కానందము కూర్పుఁడు.

నార—(తనలో) ఈతఁడు మంచిప్రశ్న యడిగినాఁడు. ఇందులకుఁ బ్రత్యుత్తరమెవ్వరిచ్చెదరో!

(మునులందరును నొకరి మొగము నొకరు చూచుచున్నారు.)

ఇంద్ర—ఋషివర్యులారా! పదునాల్గులోకములయందు మీకుఁ దెలియని విషయములు లేవు. కావున నడిగితినని యాగ్రహ మందక నాప్రశ్నకుఁదగిన ప్రత్యుత్తరమిచ్చి నావీనులకువిందు గూర్పుఁడు.

నార—(తనలో) ఏమిది! సునాశీరుని ప్రశ్నకెవ్వరును బ్రత్యుత్తర మీయకుండిరి.

ఉ॥ ఊరక మూఁగలో యనఁగ • నుండిరగస్త్య పులస్త్యగౌతముల్
ధారుణి వ్రాయుచుండె జమ • దగ్ని, పరాశరమౌనియేమియున్
నోరుమెదల్పఁడయ్యెఁ, జ్యవ • నుండు విచారము సిగ్గుఁ బర్వఁగా
నేరకయుండె మార్పలుక, • నింగిఁ గనుంగొనుచుండెనత్రియున్.

ఆహా! ఏమిచిత్రముగనున్నది! జాబాలి కశ్యపుని మొగము జూచుచున్నాఁడు. జాబాలిశాండిల్యునినోకుచున్నాఁడు. శాండిల్యుఁడు ప్రశ్నకు నీవుత్తరమిమ్మని భరద్వాజున కంగుళీసంజ్ఞఁ జేయుచున్నాఁడు. మాండవ్యుఁడు కనుగీటుచున్నాఁడు. విశ్వామిత్రుఁడు గూడ నూరకుండెను. ఎవ్వరును బ్రతివాక్యనిర్ణయము సేయనేరక యుండిరి. (ప్రకాశముగా) ఇంతమంది మునిచంద్రులున్నారు. ఒక్కఁడైన శచీకళత్రుని మాటకు బదులుచెప్పఁజాలరా! ఆహా! ఎంతవింత!

వసి—(కొంచెము ముందుకు జరుగుచున్నాడు)

నార—(తనలో) ఈవృద్ధతాపసికి కొంచెము ధైర్యమువచ్చినట్లున్నది. ఈతఁడేమయినఁ జెప్పునేమో! కానిమ్ము. ఈతనిని నేను ప్రేరేపించెదఁగాక! (ప్రకాశముగా) వసిష్ఠమునీంద్రా! అందరివలె నీవును మౌనమువహించి యుంటివేమి? ఇట్టి సభయందేదైన ధర్మవిచారము వచ్చినప్పుడు తెలిసియుండెనేని, జెప్పకపోయినచోఁ గడు దోషము. కావున బలశాసనుని ధర్మసందేహమును నీవు దీర్చి, మునులు సర్వము నెరింగినవారను ప్రతిష్ఠ నీవు గాపాడుము. లేకున్న మన మునిబృందమునకెల్ల దుర్యశము సంభవించును. (తనలో) ఏతీరుననైన నీసభయందునేను కలహమును గలిగింపవలయును. వసిష్ఠుఁడేదైనఁ జెప్పునేని యీతని కాజన్మవిద్వేషియగు విశ్వామిత్రుఁ డూరకొనఁడు. ఎట్లో వీరికిద్దరికిని కలహము ఘటిల్లును. దానంజేసి నాకానందమొనవును. (ప్రకాశముగా) వసిష్ఠా! సందియమందవలదు. లెమ్ము. ఇక వీరెవ్వరికిని జేతకాదు. నీవే తగినవాఁడవు

వసి—(లేచి) మహేంద్రా! సభయందేదైన సందేహము కలిగినప్పుడు, తెలిసియుండి చెప్పకపోయినచో దోషము. నీవడిగిన సూనృతవ్రతదీక్షాపరుఁడు భూలోకమునందే యున్నాఁడు.

శా॥ ఆకర్ణింపుము పాకశాసన! సుప • ర్వానీకసంసేవ్య! భూ
లోకాధీశుఁ డగణ్యపుణ్యుఁడు కృపా • లోలాత్మకుండర్థిర
క్షాకల్పద్రుమ మద్రిధీరుఁడు హరి • శ్చంద్రాభిధానుండు, ధా
త్రీకాంతుండొకఁ డొప్పు సూనృతవచ • శ్రీవైభవోపేతుఁడై.

మునులు—భళి భళీ!

నార—వసిష్ఠా! కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పవలెను.

విశ్వా—(లేచి వసిష్ఠునిజూచి) ఓహో! సూర్యకులపురోహితుఁడగు వసిష్ఠుఁడా! ఏదీ! నేనువినలేదు. నీవు చెప్పిన మానవుని మఱియొకసారి పేర్కొనుము.

వసి—(మరల పై పద్యమును జదివి) మహేంద్రా!

క॥ మధ్యమలోకాధీశుఁ డ
యోధ్యాపురభర్త గర్వి • తోగ్రారి నృపా
సాధ్యుండు సకలసుజనా
రాధ్యుం డహిమాంశువంశ • రత్నం బరయన్.

క॥ శరణాగతరక్షామణి
కరుణాగుణధన్యుఁ డగ్ర • గణ్యుం డిరుము
వ్వురుసార్వభౌములకు న
ధ్వరకృత్యసమగ్రవిమల • తరపుణ్యుఁ డిలన్.

క॥ గంభీరదోఃప్రతాపవి
జృంభితుఁడై దీవులందు • నేడింట జయ
స్తంభంబులు బహుయూప
స్తంభంబులు నిలిపెనతఁడు • జంభవిరోధీ!

తే॥ గీ॥ ఆనృపాలాగ్రగణ్యు జి • హ్వాగ్రరంగ
సీమనటియించు వాణికి • వేశయాజ్ఞ
యతఁడ యీరేడు జగముల • నరసిచూడ
నాడితప్పని నిత్యస • త్యవ్రతుండు.

ఆ హరిశ్చంద్రుఁడు నిరంతర సత్యవ్రతాచార పారీణుఁడని వాక్రువక్కాణింతును.

ఇంద్రు—భళిరే హరిశ్చంద్రా!

మునులు—భళిరే! హరిశ్చంద్రా!

విశ్వా—మునీంద్రులారా! అసురలోక చక్రవర్తియగు నీ మహేంద్రుఁ డీసభయం దట్టి ధర్మసందేహ మడిగినందులకును కలహభోజనుఁడగు నారదునిచే బ్రేరేపింపఁబడి యీవృద్ధుఁడగు వసిష్ఠుఁడు చెప్పినందులకును, లోకవ్యవహారములన్నియు సంపూర్తిగ నెఱింగిన మీరు "భళిరే' హరిశ్చంద్రా!" యని శ్లాఘించినందులకునుసరిపోయిన. దిసూర్యకులీనులకాదినుండియీతఁడు

పురోహితుఁడై తనపొట్ట నింపుకొనుచుండుటంజేసి, హరిశ్చంద్రుని యందుండు పక్షపాతబుద్ధిచే "హరిశ్చంద్రుఁడు నిరంతర సత్యవ్రతాచార పారీణుఁడని పలికినఁ బలుకుఁగాక! ఈతని వాక్యములకు మీరుగూడ నుబ్బితలయూపఁ జెల్లునే? (వసిష్ఠుని జూచి) వసిష్ఠా! ఈమునీంద్రులెల్లరు మహేంద్రుఁడడిగినప్రశ్నకుఁ బ్రత్యుత్తర మీయలేక యూరకొనిరని తలంచితివి కాబోలు! అట్లు కాదు. సరియైన సమాధానమియ్యక యేదియో చెప్పినచో నగుబాట్లగునని తలంచి యూరకుండిరి. "సిగ్గులేని వానికి భయములే" దనునట్లు, నీకా సంశయ మింతయు లేదు. కావున నెవ్వనినో యొక్కని బట్టుకొని యతఁడు సత్యవ్రతాచారపారీణుఁడని పలుక సాహసించితివి. ఈ దేవసభయందు ననృతములాడుటకు నీకేల యవసరము కలిగినది?

ఉ॥ ఒత్తుగ మాంసము న్నముఁగు • పోగిరముల్ ఘృతశర్కరాదులుం
గుత్తుకబంటిగా మెసఁగి • క్రొవ్విన ఘోరతితంత్రలీలలన్
మత్తిలి దేహముల్ పెంచి • మాటికిఁబొంగు నృపాలకోటికిన్
సత్తు దలంప నెక్కడిది • సంయమి! నీకిటు పల్కఁ బాడియే?

భూపతులెక్కడ! సత్యసంధులగు టెక్కడ! సిగ్గులేక, యీశచీనాథునిముందఱ తాపసులందఱు విన నిట్లు పలికితివి. అందఱును నిట్టివాఁడు జగంబున గలఁడాయని యాలోచించుచుండ, సాహసమునఁబూని తగుదునని నీవు లేచి వచించితివి. ఈ సంక్రందనుఁడు నిన్నే యుత్తరమిమ్మని చెప్పెనా? నీవు పలికిన వాక్యములు పురందరునకు నింపైనవగుఁగాక. మేము మాత్రము సహింపజాలము. మునులారా! వింటిరికదా! హరిశ్చంద్రచక్రవర్తియఁట! సత్యసంధుఁడఁట! ఇది యసత్యము! అసత్యము!

వసి — విశ్వామిత్రా! నీవు కోపముతప్పఁ బ్రపంచజ్ఞానమునే యెఱుఁగవు. ఇట్టి సభయందు ధర్మసందేహము కలిగినప్పు డెఱింగినవాఁడు చెప్పకయున్నచో దోషమని నీ వెఱుంగవా? ఇంద్రుఁడడిగిన ప్రశ్నకు సమాధానము జెప్పజాలక యీ మునులును, నీవును

గుటకలు మ్రింగుచుండ, నేను చెప్పుటనీకు తప్పుగాఁదోఁచెనా? ఔరా! ఎంతయోర్వలేనివాఁడవు! నేఁడీసభాసదులయెదుటనీయసూయాగుణంబును బ్రకటించితివి. కాకున్నచో సూర్యకులవంశజలధిచంద్రుఁడును, నిర్జితవైభవ దేవేంద్రుఁడును, కీర్తిసాంద్రుఁడును, ననవరత సత్యవ్రతాచార ధౌరేయుఁడును నగుహరిశ్చంద్రచక్రవర్తిని తక్కినరాజులతో బోల్చెదవా? వారందఱికిని నాతనిసత్యములో సహస్రాంశమైననుండునా? గాధేయా! ఆచక్రవర్తిగుణములఁగూర్చి నాకుఁ దెలిసినట్లు నీకుఁ దెలియదు. అతఁడు సత్యవాగ్రతుఁడు కాఁడని నీవుపలికినంతమాత్రమున, నిందించినంతమాత్రమున నాతనికీర్తికిఁ గొఱంతసంభవింపదు.

ఉ॥ కొంచక నీవు గర్వమున • గ్రూరతయుం బొదలంగ మించి, నిం
దించిన యంతమాత్రమున • నే తదనూనయశోగణ ప్రభా
వాంఛిత నిత్యసత్యమహి • మాధికధైర్య గభీరశౌర్యముల్
కొంచెము లయ్యెనే యకట • కోపమె కాని యెఱుంగవేమియున్.

అతఁడు సత్యసంధుఁడు కాఁడని చెప్పినచో మనకు దోషము సంభవించును. ఆతనిబోలు సత్యసంధుఁడు చతుర్దశ భువనములయందును లేఁడని మఱియొకసారి నొక్కివక్కాణించుచున్నాను.

మును—భళిరే హరిశ్చంద్రా!

నార—భళిరే హరిశ్చంద్రా!

విశ్వా—(కోపముతో) ఏమీ! హరిశ్చంద్రుఁడు సత్యసంధుఁడనియా నీవుపలుకుచుంటివి? అతనిపురోహితుఁడ వగుటచే నీ కావిషయము బాగుగఁదెలియును. ఇక జాలింపుము. నీమాటలను బాటించువారిక్కడ నెవ్వరును లేరు.

ఉ॥ ఏటికి నో వసిష్ఠ! తగ • దీక్రియ సాకెకు వట్టివాద ము
ల్లాటికి మాటికిం బెనచి • మచ్చరికంబుననాడ నీకు, నా
హాటకగర్భవిష్ణుకసు • మాయుధవైరులతోడనైన; దా
నోటమిఁబొందునే కలహ • మొందినఁ గౌశికుఁ డెట్టివేళలన్.

ఒకనరపాలాధముని, మదోన్మత్తుని, జంచలస్వభావుని, నన్నృత భాషాశీలుని, వచించి, మహాసత్యవంతునిగా దేవసభామధ్యమునజంకు గొంకులేకుండఁ బేర్కొనుచున్నావు. నీవు నాతోఁగలహముబెట్టుకొనుటకే యిట్లు పలికితివని తలంచెదను. కానిమ్ము. ఇక నీగాథేయుఁడు వెనుదీయువాడు కాడని యెఱుంగుము. లవమాత్రమైన నాయువనీశునం దుఁడని సూనృతస్ఫురణను బెద్దగా బ్రకటించుచుఁ బుచ్చకాయకు జేవదెచ్చుటకుఁబ్రయత్నించుచుంటివి. నీప్రయత్నము లిక్కడసాగవు. హరిశ్చంద్రుని నీవేగాని నేనెఱుఁగనా? ఇక నాతఁడు సత్యసంధుఁడను మాట గట్టిపెట్టుము. వృథావాగ్వాదమునకుఁ గడంగి యాయాసమును బొందవలదు.

వసి—గర్వాంధకార ప్రమత్తహృదయా! విశ్వామిత్రా! నీవుమాబోంట్లతో సంభాషించుటకైన నర్హుఁడవుకావు. అయినను నీదేవసభామధ్యమున నే జెప్పిన సందేహనివారణమునకు శంకకలుగఁజేసి, యనవసరమైన వాక్యములఁ బలుకుచుంటివి కాన, నేను దగిన ప్రత్యుత్తరమీయవలసివచ్చినది. హరిశ్చంద్రునిచిత్తము నెఱుంగక యిట్లు ప్రల్లదంబులు బలుక నీకుఁ బాడికాదు. వార్ధిలంఘించు హనుమంతునిముందు కుప్పిగంతులు పనికివచ్చునే? నీప్రౌఢతనము, నీపెంకితనము నాయెదుటనా? పిచ్చుకలను వైనతేయునితో బోల్చునట్లు సాంద్రకీర్తియగు హరిశ్చంద్రచక్రవర్తితో సరిచేసి మాటలాడుచుంటివి. ఇకనైన నోరు మూసికొని హరిశ్చంద్రుఁడు సత్యవ్రతుడని నమ్మి యూరకుండుము.

విశ్వా—(కోపముతో) భ్రష్టా! వసిష్ఠా! ఏమంటివి! నీగంభీరవాక్యములకు భీతిల్లుదునని తలంచితివా యేమి! ఈసభయం దసంబద్ధప్రలాపములాడుటయేకాక నన్నుగూడదూషించుచుంటివిగా! తలయందుగడ్డమును నెరసినంతమాత్రముననే నీవు తాపసశ్రేష్ఠుడవైతివి కా బోలు! నిర్జరశ్రేణిమెచ్చ వింధ్యాచలేంద్రగర్వము నడంచిన కుంభజుఁడును, క్రోధవీక్షణమాత్రమున నింద్రుని

నోడలెల్లఁ గన్నులైయుండఁజేసిన గౌతముఁడును,పురాణముల నేర్పాటుగావించిన వ్యాసుఁడును, హైమవతీరమణుని నెదిరించి యరకాలఁ గన్నుఁజూపిన భృగువును, సృష్టికి బ్రతిసృష్టిగావించి యపరబ్రహ్మయనఁబడిన నేనును నుండ, నీవేల తగుదునని తలయెత్తి నిర్భయముగా నీప్రశ్నకుత్తరమిచ్చితివి? నీకింతగర్వ మేలని మాయందటికంటె నీవధికుఁడవా? నిండుసభయందిట్టి యసత్యవాక్యములు పలుకు నీశిరంబిప్పుడు నాయోగదండ ముచే పగులగొట్టిన బాగుండును; కాని బ్రహ్మహత్యాపాతక మునకు భీతినొందుచుంటిని. పాపము! హరిశ్చంద్రుని సత్యసం ధుడనిచెప్పి మిగుల నలసితివి. కొంచెము కమండలోదకము ను ద్రావి దాహముదీర్చుకొని విశ్రాంతిఁ దీసికొనుము. ఒక మర్త్యాధముఁడు-అందులో భూపాలుడు-భూపాలురననేమి? మదోన్మత్తకాయులు-నిరంతర భోగపరాయణులు- మాంసాహార ప్రియులు-పరరంధ్రాన్వేషణ తత్పరులు-పరరాజ్యాపహరణకాం క్షులుగారా!-ఈహరిశ్చంద్రుఁడందులోనివాడు కాడా! బ్రహ్మసృష్టిలోనివాడు కాడా! అతని బొగడుటకు నీకుతీయందు బదములు లేకయున్నవికదా!

వసి—శివశివా! ఆ హరిశ్చంద్రుని నిందింపకుము. అతని దూషించు నీజిహ్వ వేయిచీలికలు కావలయును. నాతో జగడమాడిన నే నంత లక్ష్యముసేయను; కాని జగద్విఖ్యాతకీర్తియగు నాసార్వ భౌమునిమాత్రము నిందింపవలదు. నీయవివేకము నింకనువెల్ల డిజేసి నలుగురిచే ఛీ ఛీ యనిపించుకొనకుము.

విశ్వా—ఓరీ! పాపీ! నీనోటికింక బీగమువేసికొనుము. నీపాపభావ ములు సభకు విదితమే.

ఇంద్రు—(తనలో) వీరి కలహమంతకంతకుఁ బెరుగుచున్నది. అక్కటా! ఈధర్మసందేహము నేనేలయడిగితిని. ఇందులకుఁ గారణ ము నేనేకదా-విశ్వామిత్రుని క్రోధమునకు భీతిల్లిమునులెల్ల

రును నోరుమెదల్పఁజాలక స్థావరజంగమాకృతుల వహించి యుండిరి.

విశ్వా—(సభ్యులను జూచి) సభ్యులారా! ఈవసిష్ఠుని వాక్యములు మీరు విశ్వసింపవలదు. సూర్యవంశ్యులచేఁ బోషింపబడుచుం డెడివాఁడగుటచే, నాహరిశ్చంద్రుని నీతఁడుబట్టువలె బొగడుచున్నాఁడు.

తే॥ గీ॥ వేయునేటికిఁ బార్వతీ • విభునియాన
గరుడ గంధర్వయక్షరా • క్షససుపర్వ
దండశూకావలులలోన • మందునకును
సూనృతాలాప నియతుఁ డె • చ్చోటలేరు.

వసి—(కోపమున) ఓయీ! మూఢమతీ! గాధేయా! బరనిందఁజేయుటయు, నాత్మస్తుతి గావించుకొనుటయు జనులు కలుషముగాఁ దలంతురు. అయినను నిప్పటికార్యావసరమునుబట్టి నన్ను నేనెపొగడుకొనవలసివచ్చినది. నీనాతపశ్శక్తితారతమ్యములు కమలసూతియే నిశ్చయించియున్నాఁడు. మహేంద్రుఁడడిగిన ప్రశ్నకు నేను బ్రత్యుత్తరమిచ్చితినిగదాయని, మూఢుఁడవై నాతో నకారణకలహము బెట్టుకొనుచుంటివి. ఇటువినుము.

ఉ॥ చంద్రకళావతంసుఁడు భు • జంగమభర్తయునైన నాహరి
శ్చంద్రనరేంద్రుప్రాభవము • సన్నుతిఁజేయఁగ శక్తులే శర
చ్చంద్ర పురందర ద్విరద • చందనకుంద మరాళమల్లికా
చంద్ర మృగేంద్రులన్ గెలువఁ • జాలుదదీయయశోవిలాసముల్.

శా॥ సత్యశ్రీనిధి రాజమాత్రుఁడె హరి • శ్చంద్రుండహంకారవ
త్ప్రత్యర్థిక్షితిపాలసైన్యతిమిర • ప్రాభాత మిత్రాయమా
నాత్యంతోగ్రభుజాకృపాణ జనితో • ద్యత్కీర్తి గంగానదీ
నిత్యక్షాళితసర్వలోక దురితా • నీకుండు వీక్షింపఁగన్.

విశ్వామిత్రా! ఆహరిశ్చంద్రుఁడు పరిహాసమునకైన, గలనైన మఱుపుననైన ననృతమాడఁడని యెఱుంగుము.

మ॥ మదిరాపానసమంబుగాఁ దలఁచు న • మ్మార్తాండవంశోత్తముం
డు, దయాంభోనిధి పల్కి బొంకుటలు దు • ష్టుంగూడి వర్తించుటల్
తుదఁ జండాలుని తోడి సంగతిగఁ జే • తోవీధి భావించు, స
ర్వదిగంతస్ఫుటకీర్తి మూలధనమై • వర్తించు సత్యోన్నతిన్.

పరనారీమణు లాతనికి దల్లులు. భూతదయయే మిత్రుఁడు. పరమధర్మమే కవచము.

విశ్వా—వాయసమును గలహంసగా జేయుటకు, బకములకై నిఘంటువులన్నియు దిరగవేసి యలసిపోవుచుంటివి. మొగముగూడ కందగడ్డవలెగందుచున్నది. చాలుజాలు. ఇక నాహరిశ్చంద్రుని బొగడుచు పదములను వ్యర్థముజేయక నోరుమూసికొనుము.

వసి—గాధేయా! నీయసూయయింకనుగట్టిపెట్టవుకదా. ధర్మమూర్తి యగు నాతని చరిత్రము నీనోటబడుటచే నాతనికిపాపముగలుగునేమోయని సంశయమగుచున్నది. వేయేల! యొక్కసంగతిజెప్పెదను వినుము. మార్తాండుఁ డపరదిక్తటమునఁ బొడిచినను, మేరుశైలము గ్రుంగినను, అంభోనిధులింకినను, బ్రహ్మయొసగువరములు తప్పినను, ఇంద్రునివజ్రము పదును దప్పినను, హవ్యవాహనుడు శీతలము వహించినను, బ్రహ్మాండభాండము బ్రద్దలయినను, నాసార్వభౌముఁడగు హరిశ్చంద్రుఁ డసత్యమాడఁడు.

విశ్వా—(కోపముతో)

తే॥ గీ॥ బాపురే! నీదు పలుకుల • కిప్పురంద
రాదిబృందారకులును సం • యములు మెచ్చి
రింక జాలింపు మలసితి • వెంతసేపు
వాక్పరిశ్రాంతిఁ బొందంగ • వచ్చు నీకు.

నీవాక్యములయందు మాకు విశ్వాసము లేదు. మాటలవలన ఫలము లేదు. ఆ హరిశ్చంద్రుని సూనృతము నేను కనుంగొనవలయును.

నార—విశ్వామిత్రా! మంచిమాటఁ జెప్పితివి. హరిశ్చంద్రుఁడు సత్య

సంధుఁడని వసిష్ఠుఁడును, కాడని నీవునుపలుకుచుంటిరి. దీనివలన లాభమేమియున్నది. కావున మీరిరువురును శపథంబులు వహించియీనృపాలుని సత్యసంధతనునిర్ణయించినబాగుండును.

విశ్వా—(వసిష్ఠుని జూచి) వసిష్ఠా!

ఉ॥ ఏవిధినైనఁ జుట్టుకొని • యేజలపట్టి, త్రిశంకుపట్టి, నా
నావిధలీలలం గపట • నాటకముల్ప్రచరించి ధైర్యల
క్ష్మీవిభవంబు మాపి చల • చిత్తునిఁజేసి, యసత్యవాక్యముల్
కేవల దుర్మనీషఁబలి • కించిన బన్నిదమేమిచెప్పుమా.

నాతో నీవు ప్రతిఘటించినిలువగలవా? కానిమ్ము. నీపంతము జూపుము. నీవిప్పుడే యాహరిశ్చంద్రునిపాలికేగి యిక్కడసంగతియంతయుఁ దెలిపి ధైర్యచిత్తునిగాఁ జేయుము.

వసి—గాధేయా! నేనాహరిశ్చంద్రుని ధైర్యచిత్తుగాఁజేయ నక్కఱ లేదు. కమలసంభవుఁడే చేసియున్నాడు.

క॥ కప్పురము పుట్టుతోడనె
యొప్పగు పరిమళముగూడ • నుదయించిన యా
చొప్పున నతఁడుజనించిన
యప్పుడె సత్యవ్రతంబు • నంకురమయ్యెన్.

ఆనరేంద్రునిసత్యనిష్ఠనుగూర్చి నాకునమ్మకములేకపోయినచో నమరేంద్రునిముందింత ధైర్యముగా చెప్పుటకు నేనంత వెడగునే! నీవు గర్వించి నన్నెకసక్కెములాడుచుంటివి.

మ॥ తనసామ్రాజ్యము వాసినం గులవధూ • తంత్రంబు వర్జించినన్
దనయుండీల్గిన హీనకృత్యములచే • తన్ దుర్దశంబొందినన్
వనటంగుందిన నానరేంద్రుఁడు మనో • వాక్కాయ కర్మంబులం
దనృతంబాడఁడు నాప్రతిజ్ఞ విను వి • శ్వామిత్ర చిత్రంబుగన్.

వార—వసిష్ఠమునీంద్రా! ఆప్రతిజ్ఞను నీసభ్యులముందు త్వరగా బ్రకటింపుము.

వసి—నాకావంతయు సందియములేదు. (విశ్వామిత్రుని) జూచి గాధే

యా! నీవాహారిశ్చంద్రునిబొంకింపజాలుదువేని యిటువినుము.

సీ॥ పలుమాఱు ననునీవు • పరిహాస మొనరింప

మేటివిప్రత్వంబు • వీటిఁబుచ్చి

తపమున జపమంత్ర • తంత్రముల్ దిగనాడి

వేదశాస్త్రాభ్యాస • విధులువిడిచి

సంధ్యాద్యనుష్ఠాన • సత్క్రియల్ పోకార్చి

కటి నారచీరలు • కట్టుటుడిగి

బోడినై జన్నిదం • బులుఁద్రెంచిపోవైచి

యుపవిత్ర మగుబూది • నలఁదిమేన

తే॥ గీ॥ వారుణీపూర్ణ మనుజక • పాలపాణి

నగుచు ఖరవాహనుండ నై • యామ్యదిశకు

నభిముఖంబుగ గమనింతు • నఖిలజనులు

రోసి తొలఁగంగ బీభత్స • రూపమునను

విశ్వా—ఓ బృందారకులారా! సంయమీంద్రులారా! వింటిరికదా

వసిష్ఠునిప్రతిజ్ఞ? కానిండు. నేనట్టి నాహారిశ్చంద్రుని మదీయ

క్రోధానలంబున కింధనంబుగనొనర్చి బొంకింతును. ఒకవేళ,

సీ॥ బొంకింపలేకున్న • భుజగ కంకణుఁగూర్చి

యనిలజలాహారి • నగుచుఁదొల్లి

హిమవన్నగంబున • నమితహాయనములు

తపముచేసిన సుకృ • తంబులోన

నర్ధాంశమొసఁగి లో • కైకవిఖ్యాతిగాఁ

దగ జతుర్దశమహా • యుగములవని

బూజ్యసామ్రాజ్యవి • స్ఫూర్తులఁ బొందించి

తదనంతరంబ యీ • త్రిదివమునను

తే॥ గీ॥ రమణఁబదునాల్గు మన్వంత • రములదాఁక
నముచిసూదను నర్థాస • నంబునందు
నీరజారాతికోటీర • నీరజాక్షు
నీరజాసను తెలుఁగంగ • నిలుపువాఁడ

(వసిష్ఠునిఁ జూచి) వసిష్ఠా! ఇకనేను తదుద్యోగంబున వర్తించెద
గాక! (నిష్క్రమించును.)

ఇంద్రు—(బృహస్పతినిఁ జూచి) గురువర్యా! నాప్రశ్న యెంతకలహ
మునకుఁ గారణమైనదో గంటిరా?

బృహ—ఈవిశ్వామిత్రుఁడు క్రోధమేర్చి యీనృపాలచంద్రునకెట్టి
సంకటములఁ గల్పించునోయని సంకటము కలుగుచున్నది.

ఇంద్రు—ఇఁక నేటికి సభఁ జాలింతము.

(తెరవాలును)

ఇది ప్రథమాంకము.





# సత్యహరిశ్చంద్ర.

## ద్వితీయాంకము.

[రంగము:—అయోధ్యయందు - సభామందిరమున హరిశ్చంద్రుఁడును మంత్రియగు సత్యకీర్తియు ప్రవేశింతురు.]

హరి—సత్యకీర్తీ! అధ్వరసందర్శనోత్సాహమానసులై యరుదెంచిన రాజన్యవరులకును, బ్రాహ్మణోత్తములకును, దగిన గౌరవము జరుపఁబడి, సంతోషితస్వాంతంబులతో మరలిరికదా!

సత్య—దేవా! మహేంద్రుఁడొనర్చిన యాగముకూడ నింతవైభవముగ నుండలేదని యధ్వరము జూడవచ్చినవారందరు ననేకభంగుల వినుతించిరి.

హరి—నేనీ మధ్య నధ్వరకార్యనిమగ్నుఁడనై యుండుటచేత రాజ్యపరిపాలనమున నెట్టిలోపమున్నదో ప్రజాసౌఖ్యమున కేమయిన కొఱఁతగనున్నదో యను విషయముల నాలోచించుచుండుట లేదు.

సత్య—మహారాజా! ఈ విషయమున నీవు సంశయింపవలసిన పని లేదు. సత్యవ్రతదీక్షాపరుండవును, శరణాగతత్రాణ బిరుదాంకితుఁడవును, సర్వలోకపావనుఁడవును నగు భవత్పరిపాలనమున నెట్టికొరతయైన నుండునా?

హరి—ముఖ్యముగ రాష్ట్రమున మనము జూడవలసినది ప్రజాసౌఖ్యము. ప్రజాసౌఖ్యమే రాజ్యాభివృద్ధికి గారణము.

సేవ—(ప్రవేశించి) మహారాజా! విశ్వామిత్ర మునీంద్రుఁ డరుదెంచినాఁడు.

హరి—ఆ మహాత్మున కభ్యంతరమేమియున్నది. (ఆసనమునుండి లేచి-యెదురేగి-విశ్వామిత్రునిఁ దోడ్కొనివచ్చి) మహాత్మా! నా వందనములందుకొని ఈ భద్రాసన మధిష్ఠింపుము.

విశ్వా—హరిశ్చంద్రా! నీకు శుభమగుగాక! (ఆసీనుఁడగును)

హరి—

క॥ దురితాంధకార నవభా
స్కరబింబ కృపావిధేయ! • గాధేయ మహా
పరమ తపోధన నీ సరి
పరికింపఁగలేరు మునులు • ప్రాభవచరితా!

తే॥ గీ॥ బ్రహ్మతోడను సహమించి • ప్రాభవమున
మించి ప్రతిసృష్టిజేసి బ్ర • హ్మాభవించి
విమలతర కీర్తిగాంచిన • వేదమూర్తి
వగుచుఁ బొగడొందితివి తాప • సాగ్రగణ్య.

ఉ॥ కౌశికమౌనివర్య కడఁ • కన్నను ధన్యునిఁజేయగోరి వేం
చేసితిరే! కృతార్థమతి • జెందితి సాంగమహాధ్వరక్రియా
కౌశలపుణ్యసంపదలు • గాంచితి మించితి రాజకోటిలో
వాసికి నెక్కితిన్ దగిన • వాంఛితమెయ్యది వేఁడు డిచ్చెదన్

విశ్వా—(తనలో) ఈతని భక్తియద్వితీయముగ నున్నది. ఈతని నెవ్విధమున వంచింతును. (ఆలోచించి) జ్ఞాపకమునకు వచ్చినది. ఈచక్రవర్తి మహాక్రతువు నొకదానింజేసి యనేకకోట్ల భూసురు

లను, నగ్నులను దృష్టి బొందించినట్లు వింటిని. దానిచేత నీతని ధనాగారమున ద్రవ్యమునకు గొఱంతయుండును. (ప్రకాశముగా) హరిశ్చంద్రా! నీవు సామాన్య సార్వభౌముఁడవు కావు. నరపాలరూపము ధరించిన యమరభూజంబవు. చతురుదధిపరివృతధరణీచక్రమున నీ కీడగు వదాన్యులు లేరు. కామధేనువును గుమ్మొడుపాలడిగెడి చందమున, యశశ్శ్రీలోలుఁడవగు నిన్నొక్క యల్పదానము వేడవచ్చితిని.

హరి—మహాత్మా! సేవకునియెడ్డ సంశయింపనేల? ఆనతీయుఁడు. మీ యభీష్టము దీర్చెద.

విశ్వా—నాయందు నీ కట్టి గౌరవమున్నదని యెఱింగియే వచ్చితిని. పరమేశ్వరునకు బ్రీతిగా నొక యధ్వరము సేయఁదలంచితిని. దానికై కొంత ద్రవ్యము కావలసియున్నది.

హరి—తాపసోత్తమా! ఎంతకావలయును?

విశ్వా—నరపాలా! మనుజుడు కరిపై నెక్కి రత్నమునంబరమున కెగమీటిన నెంతపైకరుగునో యంతప్రోవుద్రవ్యము కావలయును.

హరి—మునీంద్రా! ఇదియేకదమీయభీష్టము. దీనికి యోచనకావలయునా! మీరడిగిన విత్తమిప్పుడే యిచ్చెద, తీసికొనుఁడు.

విశ్వా—(తనలో) ఆశ్చర్యముగ నున్నది. ఈతఁడింత ధనమొసంగుటకు వెనుదీయలేదే. ఈతని యనూనదానపరిభాషము మిగుల శ్లాఘ్యము. (ప్రకాశముగా)

తే॥ గీ॥ క్షోణినాయక నీమన • శ్శుద్ధి దెలియ
వలసి యడిగితిఁగాక నీ • వంటిదాత
నిండువేడ్కఁ బ్రియన్నుఁడై • యుండమాకు
నిట్టిసమయంబులను ధనం • బేమిబ్రాతి

నీదాతృత్వమునకు సంతసించితి. అక్కరవచ్చినప్పుడు నీవిచ్చిన విత్తమడిగి పుచ్చుకొందును. నీయొద్దనే యుంచుము.

**హరి**—దేవా! దానముగా నీయఁబడిన ద్రవ్యమును మరల మీయొద్ద నుంచుట ధర్మముగాదు. మీధనమును మీరు తీసికొనిపోవుట యుభయులకును క్షేమము. కావున నాయందుఁ గరుణించి యట్లుసేయుఁడు.

**విశ్వా**—రాజేంద్రా! మాకు మీవలెమందిరములుండునా! రక్షకభటులుందురా! అరణ్యములందు పర్ణకుటీరములలో ముక్కుమూసికొని తపముఁజేసికొనుచుండు మునీంద్రులీధనము నెట్లుదాచగలరు? నేనీధనమును దీసికొనిపోయి చోరులకువప్పగించుమందువా? అట్లయ్యెనేని నీవిచ్చినఫలముగూడ దక్కదుకదా!

**హరి**—పోనిండు మీకు నమ్మకమైన మఱియొకస్థలమున భద్రముజేసికొనుఁడు

**విశ్వా**—అట్లయిన నాకు నీయందే నమ్మకమున్నది. కావుననీయొద్దనే దాచియుంచుము. ఇక మాటలు పలుకవలదు. నేఁబోయివచ్చెద, నీకుఁజిరాయువగుఁగాక! (నిష్క్రమించును)

**హరి**—సత్యకీర్తి! విశ్వామిత్రుఁడిట్లుచెప్పి యరిగినాడు. ఏమిసేయుదును?

తే॥ గీ॥ విత్తమిప్పుడు గొనిచన్న • జిత్తమున వి
చార దూరుఁడనైకడు • సమ్మదమున
నుండెఁగా గల్గు నప్పుడై • నునిచెనతఁడు
క్రోధమతి నెట్టితఱి వేడు • నోధనంబు.

వనరుహగర్భవనరుహాలోచన వనరుహరిపుజూటులకైన నాతని క్రోధాగ్ని జల్లార్పశక్తిలేదు. (ఇంచుక యూరకుండి) సచివా! అతని ధనము నీవెంతభద్రముగా దాచియుంచెదవో. ఏయర్ధరాత్రి వచ్చియడిగిన నప్పుడొసంగుటకు మనము సిద్ధముగ నుండవలయును.

**సత్య**—సార్వభౌమా! నీవిందులకై విచారింపవలదు, నేను జాగ్రత్తతోడనే యుందును. అదియుంగాక మనధనాగార మెప్పుడును నిండియేయుండును.

సేవ——(ప్రవేశించి) మహారాజా! ఘోరమృగబాధాపీడితులై కొందఱుపౌరులువచ్చి దేవరదర్శనము గోరుచున్నారు.

హరి——ఏమీ! మృగబాధాపీడితులైవచ్చిరా! పాపము! శీఘ్రముగ లోపలికిరానిమ్ము.

సేవ——చిత్తము. (నిష్క్రమించి, వెంటనే పౌరులతోఁ బ్రవేశించుచు)

పౌరు——మహారాజా! రక్షింపవలయును. రక్షింపవలయును. ఇఁక మేముబ్రదుకఁ జాలము.

హరి——పౌరులారా! మీకీపరితాపమేలకలిగెను?

మొదటిపౌ——

సీ॥ సదయుండవై నేటి • తుదదాక మము నీవు,
పెంపుదీపింప బా • లింపుచుండ
నీరీతిబాధల • నెన్నఁడు పొందక,
నీచల్లదనమున • నిండువేడ్క
దల్లిదండ్రులయొద్ద • తనయులగతి నాకు
మఱుగుపిండెలరీతి • నెఱిఁవహించి
భవనంబులను బెండ్లి • పైఁడియు దడఁబడ
గుఱిలేని పాడియుఁ • గూడఁగలిగి
తే॥ గీ॥ క్రీడమై నెండకన్నను • నీడకన్న
నెఱుగ కన్నలఁ దమ్ముల • హితుల సుతుల,
గూడి సుఖమున్నవారము • కోర్కులొదవ
సత్యసల్లాప! యోహరి • శ్చంద్రభూప!

రెం-పౌ——

ఉ॥ జారులుఁ జోరులున్ విమల • సత్యవిదూరులుఁగ్రూరులున్ దురా
చారులులేరు యాచకులు • సాధులబాధలొనర్చు భీకరా
కారులులేరు,లేరు మఱి • కల్మషచిత్తులు మత్తులున్ ధరి
త్రీరమణాగ్రగణ్య వివ • రింప భవత్పరిపాలితావనిన్.

మొ.పౌ—

సీ॥ చిరతర దేవతాగృహావి • శేష మహోత్సవ కృత్యముల్ పరం
పరలుగ సాగుచున్నవృను • బల్లవ పుష్పఫలాటి సత్ఫలో
త్కరములఁబొల్చుఁ బాదపవి • కాయము లింకవు నిర్మలాంబువుల్
సరసుల నేఱులంబిదుకుఁ • జాలఁగ గోవులు దుగ్ధపూరముల్

మహారాజా! భవత్పరిపాలనంబున నీవసుంధర సకలసస్యవతి
యై యొప్పుచుండును. అకాలమృత్యువు లెప్పుడును నెఱుఁగము.

సత్య—పౌరులారా! మీకిప్పుడువచ్చిన యపాయమేమున్నది?

మొ-పౌ—మహారాజా! ఏమిచెప్పుదుము! బ్రిహ్మకైనను గణింపవలవి
కాని, నెక్కువన్నెల మెకంబులు బయలుదేరి పంటచేలఁబాడు
సేయుచు, నారామంబులఁ గలచుచు,జనపదంబులఁబ్రవేశించి
మనుజులనుగూడ హింసించుచున్నవి.

రెం-పౌ—దేవా! ఈమృగబాధను మాన్పిమమ్ము రక్షింపవలయును.

మొ-పౌ—అఘోరమృగబాధలు చెప్పఁదరముగాదు. నిన్నటిదినము
పొలమునకరిగిననాకు మూరునినొకవ్యాఘ్రముసోటగఱచుకొని
పోయిహింసించినది. అతనిమేనగోడలును అయ్యో! ఏమిచెప్పు
దును! ఎనిమిదేండ్లది పులివాతఁబడినది.

హరి—హరిహరీ! మీకట్టిదుస్థితికలిగినది. పౌరులారా! జరిగినదానికి
జింతింపవలదు నేను నేడే యరుదెంచి యరణ్యమునయున్న దుష్ట
మృగవ్రాతమును జంపి మీకు ముదముఁగూర్చెదఁబొందు.

పౌరు— చిత్తము.

హరి—సత్యకీర్తీ! వేటకువలయుసన్నాహము నొనర్పుము. రమ్ము—

---

(నిష్క్రమింతురు)

రంగము ?—[అరణ్యము- హరిశ్చంద్రుడు, చంద్రమతి, లోహితాస్యుడు, సత్యకీర్తి ప్రవేశించుచున్నారు.]

హరి—(చంద్రమతితో) తరుణీ! ఘోరమృగాకరంబైన యీయరణ్యమునకు రావలదనిచెప్పిన వినకవచ్చితివి. ఇందు మీకేమిభయంబొందవుగదా!

చంద్ర—ప్రాణేశ్వరా! మీరుండగా మాకు భయంబేమి!

లోహి—నాన్నగారూ! నాకుఁగూడ నొకచిన్నవిల్లు నొసఁగుఁడు. మృగముల వధించెదను.

(తెరలో-కలకలము)

సత్య—(ఎదుటఁజూచి) మహారాజా! వేటకు వలయుసన్నాహముతో గిరాతులు వచ్చినారు. అటుజూడుఁడు.

మ॥ బలుకోలల్ తనుమధ్యముల్ మహదురో • భాగంబులుంబెద్దమూతులునుంగల్గిమృగేంద్రడింభములకుం • దుల్యంబులైనట్టి జాగిలపుంగుక్కల హేమశృంఖలములన్ • నీలించిగోటాన గోటుల వేగంగొనివచ్చి రాటవికులా • టోపంబువాటిల్లఁగన్॥

హరి—(ఎదుటజూపుచు చంద్రమతిని విలోకించి) సతీమణీ! ఆజాగిలముల పౌరుషము జూచితివా?

చ॥ గొలుసులబట్టి లుబ్ధకుల • కుంఠితశక్తిఁ గుదించినిల్పగా బలువిడి నఁఘుర్లిలన్ బయలు • పల్మఱుఁద్రవ్వుచు వీకమై సభాస్థలిఁ గబళింపఁబాఱెడు వి • ధంబున మోరలుమీఁదికెత్తికుక్కలు ఘనభాంక్రియాధ్వనుల • గాఢతరోద్ధతినించె దిక్కులన్.

సత్య—దేవా! అటు జూడుడు.

మ॥ తలచుట్టున్ జడచొళ్ళియుంబులును నీ • లట్టీలుజేకట్లులు దండలు వాకట్లులు ముప్పి దుల్మెకములన్ • డాకోల్పువస్యంపు మందులునుంజోపుడ గోలలుం గుఱుచరే • దుడ్లున్ సమగ్రంబులై చెలువారన్ భటకోటివచ్చె మృగయా • శృంగార మేపారగన్.

వేటకాండ్రు—(ప్రవేశించి) మహారాజా! మృగసంహారమునకాన తీయుడు.

హరి—జాగరూకులై మెలఁగుడు. నేనుగూడ వచ్చుచుంటిని. (సత్యకీర్తినిఁజూచి) సచివా! రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)



రంగ:—(అరణ్యము—హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, సత్యకీర్తి పౌరులు ప్రవేశింతురు.)

హరి—(పౌరులను జూచి) పౌరులారా! అరణ్యమున నున్న దుష్టసత్త్వములన్నియు నమసినవి. ఇక మీరు గృహంబులకరిగి సుఖంపుఁడు. (సత్యకీర్తినిఁ) అమాత్యవర్యా! వేటకాండ్రకుఁ దగిన బసదనములు మనము పురమున కేగినపిదప జేయుదు మని చెప్పి పంపితివా?

సత్య—చిత్తము.

హరి—సత్యకీర్తీ! మృగయావిహారకారణమున మన మింతదూరమే తెంచితిమి. మనరాక సఫలము జేసికొని పోవుదము. (ఎదుటఁజూపుచు) అటుఁజూచితివా?

లయగ్రాహి.

అల్లదె సదాగతినటల్లహరి దైత్యరిపుభల్లముకుటప్రసవవల్లసముదగ్ర
త్ఫుల్లకుముదాబ్జ నవహల్లకవసద్భ్రమర ముల్లమున గౌతుకము వెల్లిగొనఁగన్నుల్
చల్లఁగఁ బయోధిప్రియవల్లభఁ గనుంగొనుముకొల్లలుగ ముక్తిరమ నెల్లపుడు మజ్జ
త్సల్లలితచిత్తులకుఁ బెల్లొసఁగుజహ్నుముని తల్లజుమతోరుతటి నల్ల చదలేటిన్.

తత్తీరమున మనగురుఁడగు వసిష్ఠుఁడున్నాఁడు. అమ్మహాత్ముని దర్శించిపోవుట మనకు శ్రేయస్కరము.

చంద్రీ—మహనీయుల సందర్శనము సమస్తశుభాస్పదము కదా!
(నడచుచున్నారు)

హరి—సత్యకీర్తి! మనము వసిష్ఠునియాశ్రమమును సమీపించినాము. (ఎదుటఁ జూచి) అదిగో! మునీంద్రుఁడు పద్మాసనస్థుడై యున్నాడు.

(తెరలేచును—వసిష్ఠుఁడు ఆసీనుఁడైయుండును)

హరి—చంద్రీ—లోహి—తాపసేంద్రా! భవదీయచరణారవిందములకు నమస్కరించుచున్నాము.

సత్య—(నమస్కరించును.)

వసి—హరిశ్చంద్రా!

చ॥ అపగతబుద్ధి నింత మృగ • యావ్యసనంబునఁ గేళిసల్పగా
నృపులకు నీతిగాదు, ధర • ణీశ్వర! భార్యయు నీవు భీకరా
తపసమయంబునన్ బహువి • ధంబుల దుష్టమృగంబులున్న యీ
విపినములఁజరించుట వి • వేకమె యాత్మఁదలంచి చూచినన్.

కానిమ్మ జరిగినదానికి విచారించిన లాభములేదు. ఇఁకనీవాలసింపక శీఘ్రముగా బురికిఁబొమ్ము. ఇక నొకమాట నీకుఁజెప్పవలసియున్నది. మఱచిగాని, తప్పిగాని విశ్వామిత్రుని యాశ్రమమునకుఁ బోవలదు. అతఁడు మహాక్రోధమూర్తి. పరరంధ్రాన్వేషి

హరి—మహాత్మా! మృగబాధచేఁ బీడింపఁబడి పౌరులువచ్చి మొఱ్ఱవెట్టికొనగా నిట్టువచ్చితిని. వచ్చునప్పు డరణ్యవిశేషముల దిలకించుటకు ముదంబందుటచే నీసతీసుతులను వెంటఁబెట్టుకొనివచ్చితిని. దేవా! నాయజ్ఞానమును మన్నింపుము.

వసి—సరే. కడుఁదయంబునఁ బురిఁజేరుము. మీకు శుభమగుగాక
(నిష్క్రమించును)

హరి—సతీమణీ! రండు. (నిష్క్రమించుదురు)

విశ్వా—(ప్రవేశించి తనలో) కారణమేమియోగాని హరిశ్చంద్రుని బొంకించుటయందు నాపనం బించుక వెనుదీయుచున్నది. నేను మనోరథసిద్ధుఁడనగుదునో. (ఆలోచించి) కాదు. కాదు. పట్టినపట్టు సంపూర్తిగఁ బరీక్షించువఱకువిడువరాదు. నేనిప్పు డెట్లయిన నీతని నాయాశ్రమ సమీపమునకుఁజేర్పవలయును. ఇందులకై మాయామృగంబునొంకు పంచెద.

(నిష్క్రమించును)

(హరిశ్చంద్రుఁడు సతీసుతమంత్రులతోఁ బ్రవేశించును)

హరి—సత్యకీర్తీ? ఈనాడు మనము పురముజేరఁజాలము. గావున, నీ సమీపమునం దెచ్చటనైన విశ్రమింతము.

(నడుచుచున్నారు)

(హేమహరిణము వచ్చును)

హరి—(లేడినిఁజూచి) ఆహా! ఆహరిణముసొంపు విచిత్రముగనున్నదే మున్నెన్నఁడు జూచియుండలేదు.

లోహి—నాన్నగారూ! అటుజూడుఁడు.

సీ॥ బంధనంబెడలి భూ • భాగంబుఁజేరి యి
 చ్ఛాలీలవిహరించు • గాలియిట్టి
కుందేటితోఁబొత్తు • గూడకవచ్చిన
 యుడురాజబింబంబు • నడిమియిట్టి
వీరభద్రునికృప • వెండియు నుద్భూత
 మైన దక్షమఖంబు • లోనియిట్టి
కుధరనందనవేడి • కోనవిసర్జించిన
 చేతోభవారాతి • చేతియిట్టి

తే॥ గీ॥ ననుకరించుచుమిగుల బెం • పగ్గలింప
మంచినూరుపును బరువును • మదము ముదము

పొదలఁ గనువారి కిం • పులుఘటిల్ల
నల్లనల్లన నడయాడె • నభినయముగ.

దీనింగూడి యాడుకొన నాకుఁ గోర్కె జనించినది.

హరి—వత్సా! ఈస్వల్పాభీష్టము దీర్ప లేకయుందునా? (సత్యకీర్తినిఁ జూచి) సత్యకీర్తీ! నే నీహరిణంబునుబట్టుకొనివచ్చి కుమారుని ముద్దుదీర్చెద. సతీసుతులయొద్ద నీవుజాగరూకుఁడవై యుండుము. (నిష్క్రమించును)

లోహి—అమ్మా! తండ్రిగారివెంట నేనుగూడ లేడిని బట్టుకొనుటకు సహాయము చేయుటకుఁ బోవుదునా?

చంద్ర—నాయనా! ఇటఁగూర్చుండుము. నీతండ్రిగారు సత్వరముగ నే వత్తురు.

సత్య—(ఎదుటఁజూచుచు) ఆహరిణము విచిత్రగతుల బోవుచున్నదే. ఇది సాధారణముగ నందునట్లులేదు. (చంద్రమతిని జూచి) అమ్మా! అటుజూడుము.

సీ॥ చేయూఁక కుప్పించి • చివ్వున దాటుచు
గొమ్ములచే బయ • ల్చిమ్ముకొనుచు
బిత్తరంబులుగాఁగ • బేరెముల్వాఱుచు
మలగిన కైవడి • మలసికొనుచు
గసవుపోచలు కసి • గాట్లుగాఁ గొరుకుచు
వివృతాస్యమునఁ జాఱ • విడుచుకొనుచు
రిక్కరిక్కనఁ దోఁక • దిప్పిజాడించుచు
ఖురపుటంపుల దల • గోకుకొనుచు
తే॥ గీ॥ నిగిడిపాఱుచు నంతంత • నిలువఁబడుచు
నొడలికండూతికై చెట్ల • నొరసికొనుచు
నుదరియొక్కెడ మిన్నక • బెదరిపడుచు
గువలయేశ్వరు నెలయించి • కొనుచు సరిగె.

చంద్ర—ఇట్టి విచిత్రమృగమును మున్నెన్నడును జూడియుండకపోవు
టచే నిదియే మాయమృగమోయని యనుమాన మొదవు
చున్నది.

లోహి—నాన్నగారు మనకుగనిపించుటలేదు. నేనుగూడనరుగుదునా?

సత్య—వలదు. వలదు. మహారాజుగా రిప్పుడే వత్తురు.

చంద్ర—అదిగో! అనుకొన్నంతలోనే వచ్చుచున్నారు.

హరి—(ప్రవేశించి) సతీమణీ! నిశ్చయముగా నయ్యది మాయామృ
గంబనియే తోచుచున్నది.

క॥ ఎక్కడి హేమ కురంగం
బెక్కడిమృగయావిహార • మెక్కడి విపినం
బిక్కడి కేటికివచ్చితి
మక్కట మిక్కిలిప్రమాద • మయ్యె న్మనకున్.

తే॥ గీ॥ నవవిరించి యరుంధతీ • నాయకుండు
మఱచితప్రియు గాధిసు • మారువనము
చొరకుమీవని చెప్పె వి • శుద్ధబుద్ధి,
గోరి నామీద వాత్సల్య • గుణముపొదల.

అక్కటా! మనము మోసపోయితిమి.

చంద్ర—ప్రాణేశ్వరా! అదియేమి!

హరి—సతీమణీ! ఆమృగము నన్నుఁ గడుదూరము గొనిపోయి విశ్వా
మిత్రుని యాశ్రమము బ్రవేశించి యంతర్థానమయ్యెను. ఇప్పు
డు మన మేమిచేయుదము! వసిష్ఠుడు చెప్పిన పలుకులువిని పుర
మార్గమునుబట్టి చనక యీలేడివెంటవచ్చితిని. మృగయావిహార
కారణమున నేమికీడు రానున్నదో! విశ్వామిత్రుడు క్రోధస్వ
భావుడు.

ఉ॥ ఆమునిసార్వభౌముని దృ • గంతము లించుక జేవురించినన్
హేమగిరీంద్రమైన ధృతి • నేపఱి బిట్టుచలించు మ్రొగ్గ ది
క్సామజయూథమైన నుడు • సంఘములైననురాలు నా సుధా
ధామదినేశులైనఁ గడఁ • దల్లడ మందుదు రేమి చెప్పఁగన్.

ముక్కంటి గర్వమైన నడఁచు నమ్మునీంద్రునకు నేననఁగ నెంత? మునీంద్రులు సామాన్యులు కారు.

చ॥ మలయజశైత్యయుక్తములు • మానసముల్ విలయోష్ణభాను మం
డల కిరణాతితీక్ష్ణములు • నాలుక లెప్పుడు మానికోటికిం
దలఁప ననుగ్రహించినఁ బి • తామహుఁ జేయుదు రల్పునైన; జే
రలుక వహించిరేని, కడు • నల్పునిఁ జేయుదు రప్పితామహున్.

(సత్యకీర్తిం గాంచి) మంత్రిసత్తమా! ఆమునిచంద్రుఁ డాగ్రహముం బూనకమున్నె మనమాతనిసన్నిధి కరిగి తత్పదంబులకుఁ బ్రణమిల్లుదమా! లేక సత్వరముగ నిచ్చటినుండి తొలఁగిపోవుదమా! ఇప్పుడు చేయవలసినకార్యము నిర్ణయింపుము.

సత్య— రాజేంద్రా! అర్థిజనపారిజాతమవు. అంభోరాశి గంభీరుఁడవు, మేరుధీరుఁడవు. సర్వలోకస్తవనీయ నిరంతర సత్యవ్రతాచార పారీణుఁడవు. అట్టి నీపై నాగ్రహించు వా రెవ్వరు? అదియుం గాక శత్రుమిత్రత్వములు సమముగాఁ జూచుచు, లోకవ్యవహారములయందుఁ బాల్గొనక యడవులయందు దపోవృత్తి నుండువారికి నృపులతో విరోధమునకు బనియేమియుండును? మఱి యొకసంగతి విన్నవించెదను.

చ॥ జనవర నీకుఁ గౌశికుఁడె • సన్ భయమేటికి నింత యాత్మలో
ననుపఁగ నామునిప్రవరు • డుల్లమునం గృప పిక్కటిల్ల మీ
జనకుఁ ద్రిశంకుభూవరు వి • శంకటశౌర్యుని బొందితోడనే
యనుపఁడె దేవతాపురికి • నారసిచూడ మహాద్భుతంబుగన్.

కావున నీవిషయముంగూర్చి చింతింపక యొక్కింతకాలము విశ్రమింపుము

చంద్ర—ప్రాణేశ్వరా! ధైర్యచిత్తుండవై నాయంకతలమున శిరముంజేర్చికొంచెము నిద్రించుము.

హరి—(చంద్రమతియంకముపై శిరముఁజేర్చి నిద్రించును.)

చంద్ర—(తనలో) ప్రాణేశ్వరునకు మిగులడస్సియుంటచే నిద్రశీఘ్రముగ బట్టినది.

హరి—(నిద్రలో నులికిపడి) హా! మునీశ్వరా! నేను నిరపరాధినిం క్షమింపుము, క్షమింపుము.

చంద్ర—(వెన్నుచరచి) ప్రాణేశ్వరా! ఏల యీరీతి భయమందుచుం పలికెదవు? నీకేమయిన దుస్స్వప్నము వచ్చినదా?

హరి—(భయముచే నిటునటు జూచుచుండును)

చంద్ర—నాథా! ఏమి యీభయము? ఇంతకుముందేకదానీవు నిద్రించితివి. శరణాగతరక్షణదక్షుఁడవు. పరిపంథినృపాల గర్వాంధకారప్రభాకరుఁడవు.సప్తద్వీప సముద్ర ముద్రితమహీవలయపరిపాలకుడవు. నిత్యసత్యవ్రతదీక్షుడవు. అట్టినీకు భయకారణమేమి! ఇక్కడ నొరులెవ్వరును లేరు.

హరి—రమణీ !నీవు తలంచినట్లుగా నేనునిశ్చయముగా దుస్స్వప్నమునే గంటిని. ఏను సభామందిరమున సింహాసనాసీనుఁడనై యున్న సమయమునవిలయకాలరుద్రునిలీల మండిపడుచునొక్కమునీంద్రుఁడరుదెంచి, నాకిరీటంబు నేలబడునట్లుదన్ని, పురము వెడలజేయు, ననేకకష్టములపాలై, తుద కీశ్వరానుగ్రహము నమరలసామ్రాజ్యవైభవమును గంటినని దుస్స్వప్నముగంటిని.

చంద్ర—(తనలో) అక్కట ! ఇదియేమిదుస్స్వప్నము !(ఇంచుకయూరకుండి)ఈతనిని ధైర్యచిత్తునిగాఁ జేయవలయును.(ప్రకాశముగా)

మనోహరా! ఇంతమాత్రమునకై నీ వడలవలయునా? ఈదుస్స్వప్నమున దొలుత మనకు గష్టములుకలిగినను, తుదకు మరల రాజ్యశ్రీలఁగాంచినట్లు కానిపించినది. ఇటువినుము.

చ॥ అలుకజనించివచ్చినథ ♦ రామరవర్యుఁడు గాధిపుత్రుఁడు
జ్వలముకుటుంబుదన్నుటలు ♦ చయ్యన రాజ్యవిభూతి బాయుటల్
పలుమఱుఁదన్ని మిత్త్రమున ♦ శాస్త్రములొనుబహుప్రయాసముల్
గలుగుశశాంకమౌళికృప ♦ గ్రమ్మఱ రాజ్యరమావిశేషముల్ ॥

కావున దీనింగూర్చి యధైర్యమంది చింతింప నవసరములేదు.

విశ్వా—(ప్రవేశించి తనలో) ఈతనిచిత్తము గలంచుటకు మాతంగ కన్యల బంపి యేమిజరుగునో ఈసమీపముననే యుండి యరసెదగాక.

(నిష్క్రమించును.)

(తెరలో గానము వినవచ్చును)

హరి—(దిక్కులజూచుచు) ఈ మనోహరగాన మెచ్చటినో కదా! విచారసాగరమగ్నుల కీసంగీతము నావయేకదా!

విశ్వా—(మాతెతలతోఁ బ్రవేశించి వారినిఁజూచి) పుత్రికలారా!

సీ॥ పాటించివినుఁడు నా ♦ పలుకులుదెలియంగ
గంధసింధురరాజ ♦ గమనలార
బిత్తరివన్నెలు ♦ పెట్టి మీరెంతయు
నొనపరిబాగులఁ ♦ బూనఁగనరిగి
జలజాప్తకులవార్ధి ♦ చంద్రు హరిశ్చంద్రు
సద్భక్తిదర్శించి ♦ సంస్తుతించి
సంగీతవిద్యా ప్ర ♦ సంగముల్ పచరించి
మృదుమధురోక్తి సం ♦ పదలు నెఱపి

తే॥ గీ॥ వివిధలాస్య క్రియాకళా • విధులు చూపి
చేరి సంతోషితస్వాంతుఁ • జేసి యతని
నడుగరాని పదార్థంబు • లడిగి ధైర్య
హీనుగావించి బొంకించి • యేగుదెంచు.

మాతంగకన్యలు—తండ్రీ! నీయాజ్ఞ శిరసావహింతుము.

విశ్వా—(నిష్క్రమించును)

మాతం—(హరిశ్చంద్రుని సమీపించుచున్నారు)

సత్య—మహారాజా ! ఇంతకుముందు దేవరకు వినవచ్చిన గాన మాయలివేణీమణులదే యని తలంచెద. అదిగో ! వారిట్లే వచ్చుచున్నారు.

1 మాతం—(హరిశ్చంద్రుని సమీపించి)

మ॥ జయమార్తాండ కులావతంస ! విమత • క్ష్మానాథనానాచమూ
చయపాథోనిధికుంభసంభవ సమ • స్తద్వీప విన్యస్త భూ
రి యశస్తంభ విజృంభమాణమత వ • ర్ణింపస్సమర్థుండె యు
వ్యయమైయొప్పు భవన్మహామహిమ యు • ర్వ్యాతాళనాధీశుఁడున్.

2 మాతం—

ఉ॥ నీరమణీయవైభవము • నిర్జరవల్లభు గెల్చు, నీమహో
దారత పారిజాతవసు • ధారుహముం బ్రహసించు, నీశుభా
కారము చంద్రమండలము • గైకొనకుండు నటంచు మాటికిన్
సూరిజనుల్ నుతింప నినుఁ • జూడఁగవచ్చితిమయ్య వేడుకన్.

1 మాతం—సార్వభౌమా! మా పురాకృతపుణ్యవిశేషమునభవదీయ దివ్యమంగళవిగ్రహ సందర్శమున మాకిచ్చుట లభించినది.

హరి—నారీమణులారా! మీరెవ్వరు? ఎందునిమిత్త మిచ్చ్యేడ కరుదెంచితిరి?

మాతం—మహారాజా ! మేము మాతంగకన్యలము. అవివాహితలము. వీణాగానమందు బ్రావీణ్యము కలదు! దేవరముమ్ము బరీక్షింప బ్రార్థితులు.

చంద్ర—(తనలో) విచారచిత్తుడై యున్న నాథునకు వీరి గానము కొంత సంతోషము గలుగజేయుగాక!

(మాతంగకన్యలు పాడుచుందురు)

హరి—(సత్యకీర్తినిజూచి) సచివా! వీరిగాన మపూర్వముగను, నద్వితీయముగ నున్నది. హారమణిపంక్తికరగి నీరయి స్రవించుచుండె. (ఇంచుక యూరకుండి) మాలెతలారా! ఇక మీ గానమాపుఁడు. (సత్యకీర్తిఁ జూచి) సత్యకీర్తి! వీరినిమణిమయాభరణములచే సత్కరించి పంపుము.

సత్య—(ఆభరణముల నీయబోవును)

1 మాతం—(పుచ్చుకొనక నవ్వుచు)

తే॥ గీ॥ ఈపదార్థంబులేల ధా • త్రీశమాకు
వివిధ భావజ్ఞమతకళా • వేదవీవు
బడలితిమి చాలనిబిడాత • పంబుచేత
నీసితచ్ఛత్రిమొసఁగి మ • న్నింపవలయు.

2 మాతం—

చ॥ ధరణితలేశ నీగొడుగు • దక్కఁగ దక్కినవస్తువుల్ పరం
పరలుగనెవ్వియిచ్చినను • బర్వినతాపము బాయనేర్చునే
పొరిఁబొరిగాయనెండఁగడుఁ • బొక్కెశరీరము వేడ్కమామొడం
గరుణవహింపఁగాఁదగు న • ఖండితదానకళాధురీణతన్.

హరి—(కోపముతో) ఔరా! సాహసము! ఛత్రముకావలయునుగాక! ఈరీతిఁగోరినయాచకులను మున్నెందుగనియెఱుంగ. నృపాలు

రుఛత్రచామరములు దానముగానీయరను మాటనెఱుంగరే.
తెలియక కోరితిరి కాబోలు! (ఇంచుకయూరకుండుదురు) కాంత
లారా! మీకిక నేదియైన గోరుడు.

1 మాతం—

చ॥ శీతలవస్తుసంతతుల • చేతనడంపఁగవచ్చుఁగొంత, యీ
యాతపతాపఖేదము ధ • రాధిప! మన్మథబాణఘాతసం
జాతవియోగతాపమున • జాలఁగృశత్వము నొందుమమ్ము స
త్కౌతుకలీలనీబిగువు • కౌఁగిటఁజేర్పు రతిప్రసంగతన్.

హరి—(చేతుల చెవులఁ జేర్చి) శివ శివా!

చంద్ర—ఛీ!

సత్య—ఔరా! కండక్రొవ్వు!

హరి—(మాలెతలవిలోకించి) చండాలాంగనలనితలంపక, గానవిద్యా విశారదలని సత్కరించినందులకు మీరింత సాహసమునకొడిఁగట్టితిరి. దర్శనస్పర్శనములకుఁ దగని మీరీరీతి భయములేక పలుక నాలుక లెట్లాడె? మీజాతిగుణమును వెల్లడించితిరి. మీయందావంతయు యాచకలక్షణము కానిపింపదు. మీరెక్కడి మాయాచండాల వనితలో! (ఇంచుకయూరకుండి) స్త్రీలగుటచే మీయపరాధము సైరించితిని. ఇఁకనిట్టి దురుక్తులు పలికితిరేని మీనాలుకలు గోయుమగాక!

1 మాతం—(సమీపించి నిర్భయముగా) రాజేంద్రా! తమంతతాము వలచివచ్చిన కాంతలను తిరస్కరించుట పురుషులకు ధర్మము కాదు. మమ్ము గృపార్ద్రహృదయుడవై నీకౌఁగిటఁజేర్చి తాపముదీర్పుము.

2 మాతం—చక్రవర్తివగు నీయందను మేము చేరినఁగాని మన్మథుని

గర్వమడంగదు. అదిగో! చూడుము, ఆ సుందరలతామంది
రము! శత్వరముగ మాయభీష్టముదీర్చి పుణ్యముగట్టుకొమ్ము.
1 మాతం—కందర్పతాపమున ప్రాణములుపోకుండఁ గాపాడుము.
(సమీపించి చేయిఁబట్టుకొనబోవును)
హరి—(తప్పించుకొని,కోపముతో) ఛీ! జారిణులారా! ఇట్టి దురుద్యో
గమునఁ బ్రవర్తింపఁదలచిన మిమ్ముఁ జంపినను బాపముకలు
గదు. మీకుదండ బుడిపెదఁగాక. (ఇంచుక కొట్టును)
మాతం—హా! (ఏడ్చుచు) రాజేంద్రుఁడవనియు, సరసాగ్రేసరుఁడవ
నియు వచ్చినందులకు మమ్మిట్లు దండించెదవా! ఇదియేనా నీ
సరసత్వము! ఇదియేనా నీ ధర్మసంధత?
హరి—మారపలికినఁ బ్రాణములఁ దీయుదును. (మీదకుఁబోవును)
సత్య—(హరిశ్చంద్రునివారించి) దేవా! శాంతింపుము.
మ॥ జననాథోత్తమ! యీడువాండ్రపయినీ • చందంబుగానుగ్రతం
గినియంబాడియె శిక్షకర్హులె వీర • ల్కాంపకెనరోజేక్షణల్
వినమీవల్గినదుర్మదోద్ధత మహా • విద్వేషి రాజన్య సై
న్యనికాయంబులమీదఁ గాక తగునే • యన్యప్రదేశంబులన్.
రాజేంద్రా ! నీకీగోసంగిపడుచుల వారించుట, మదగజము
కదళీ తరువులవిదళించువిధమున నున్నది
సీ॥ ఈవెలందుకల ప • య్యెదలభీయాతి భూ
మీతలాధీశుల • కేతనములె
యీపంకజాక్షుల • యెలవంక బొమలహుం
కారవద్వైరుల • కార్ముకములె
యీకీరవాణుల • కోక స్తనంబులు,
మత్తారిగిరిదుర్గ • మండలములె
యీరాజముఖుల మృ • దూరుదండంబులు,
కపటవిద్వేషుల • గరికరములె

తే॥ గీ॥ యీపటంతుల కడగంటి • చూపు లహిత
మనుజనాయక సునిశిత • మార్గణములె
వీరిఁ గోపింపఁదగునె యు • ర్వీకళత్ర!
కృపఁదలిర్పఁగఁజూచి, ర • క్షింపవలయు.

మ॥ వల దీరోషము మానుఁడీ తగదు నా • వాక్యంబుఁ బాలింపు డ
ర్థుల బ్రత్యర్థులరీతిఁజూచిన మహా • దోషంబు ప్రాపించు ను
జ్జ్వలకీర్తీశ్వర! యాచకప్రకరర • క్షాదక్ష! యీవేళకున్
వలయున్ మానుక శేముషీపథమునన్ • వర్తింప శాంతిస్థితిన్.

(మాలెతలంజూచి) మాలెతలారా! అవివేకంబునం జేసి మీరిట్టి సాహసంబునకుఁ గడంగి, సత్యసంధుఁడగు మాచక్రవర్తి కాగ్రహము గలిగించితిరి. గతించినదానికి చింతింపక మీనెలవులకు బొండు.

**మాతం**—(కోపమున) ఇంతటితో నీరాజును విడిచిపుత్తుమా?

(నిష్క్రమించుదురు.)

**చంద్ర**—(హరిశ్చంద్రుని జూచి) నాథా? నాకిదియంతయుఁ గడునద్భుతముగనున్నది. ఎక్కడనైనను హేమకురంగమును మనము జూచియుంటిమా! ఆలేడిని వెంటాడించి యింతదూరము వచ్చితిమి. ఇక్కడికీ మాతంగకన్యలు వచ్చిరి. తాపసాశ్రమభూము లందు చండాలాంగన లెట్లుసంచరింతురు? నిక్కముగా వీరు గోసంగిపడుచులేమైనచో నిట్టి యగణ్య సౌందర్య లావణ్య విలాసములుండునా? ఆలోచించిచూడగా నిదియంతయు గాధేయుని కపటకృత్యముగ దోచుచున్నది. వసిష్ఠముని వచించిన పలుకులు నిజమగుచుండె.

**హరి**—నాకును నేదియో మాయగనే తోచుచున్నది. కోపావేశమున నామాలెతలను కశాఘాతంబులపాలుగూడఁ జేసితిని. అందు లకై నొకవిధమగు భయముగూడ గలుగుచున్నది.

(తెరలో)

శా॥ ఏమేమీ! మిము భూవరాధముఁడు డా • నెంతే నహంకారియై
భీమస్ఫూర్తిఁ గశాభిఘాతములచే • బిట్టల్కనొప్పించెనే
యేమాడ్కిన్ దరియించువాఁడొ యిఁక నే నూహింపఁగఁ గల్పాంతవే
ళామృత్యుంజయ ఫాలనేత్రశిఖిలీ • లం బర్వు మత్కోపమున్.

హరి—(విని యెదుటఁజూచి భయమున) హా! సతీ! మనము తలంచినట్లే యైనది. ఇదియంతయు విశ్వామిత్రునిమాయయే. అదిగో! త్రిపురదానవులపైకిబోవు రుద్రునిలీల, దుర్వారకోపావేశమున నయనంబుల నగ్నికణంబులు రాల్చుచు, ప్రచండదండము కరంబునఁబూని, పండ్లుకొఱుకుచు, బదతాడనంబున భూమియదర నవ్విశ్వామిత్రుండిట్లువచ్చుచున్నాఁడు. ఇఁక గతియేమి?

విశ్వా—(ప్రవేశించి హరిశ్చంద్రునిఁజూచి)

శా॥ ఓరీ రాజకులాధమా! నృపులు తే • రో వేటకారో మన
క్రూరాభీల మృగాదులం దునుమరో • ఘోరాటవుల్లేవా, మా
యారామంబుఁ గలంచి జంతుతతి మా • యం జేసి యస్మత్కుమా
రీరత్నంబులు వేడవచ్చినను వా • ర న్నోమ్మదినావేమిరా!

హరి—(భార్యాపుత్రులతో విశ్వామిత్రుని పాదములపై బడును)

విశ్వా—ఛీ! దురాత్మా! (శిరముపైదన్నఁగా గిరీటము క్రిందఁబడును)

హరి—(పాదములు విడువక) మునివరేణ్యా! మదీయ రత్నకాంచనకిరీటమునకు దాకుటంజేసి, మీపాదము నొచ్చియుండును. దేవా! నే నొనర్చిన యపరాధమేమియున్నది? రక్షింపుము.

విశ్వా—ఓరీ రాజకులపాంసనా! నీవుచేసిన కుటిలకృత్యముల కొఱ పాదమేకాదు. సకలాంగకములు నొచ్చినవి. “చంకదుడ్డు బెట్టుకొని శరణార్థి,, నను వాక్యము నీయెడందు నిజమయ్యె. మునుల యాశ్రమభూముల కగ్గుసేయుటకే నీ కీచకవర్తిత్వము లభించినదా! ఇట్లు ప్రవర్తింపుమని నీ కెవ్వఁ డుపదేశించినాఁడు?

చ॥ నృపతులు తొంటివారలు వి • జృంభణంబులఁ జమూసమేతులై
విపినములన్ వినోదగతి • వేటమెయిం జరియించుచుండరే
తపసుల యాశ్రమంబులను • దద్దయునీవలె నిష్ఠురక్రియం
గృప హృదయంబులో సడలి • కీడువలంపరుగాక యెన్నఁడున్.

మా యాశ్రమసారంగమును వెన్నంటి దానిం బడలించితివి కదా. దాని కేమి! అదియట్లుంచుము.

మ॥ మనోనాభిరంప్రసుకూతులైనెలయు "నా" • మాతంగవామాక్షులన్
గరిణీయానలఁ బల్లవాధరల రా • కాచంద్రబింబాస్యలన్
సరసాలాప కళావిలాసనిధులన్ • సంగీతచాతుర్యలన్
గరుణాహీనతఁ బట్టిసమ్మెటల న • ల్కంగొట్టఁగా బాడియే?

ఆశచే నిన్నర్థింపవచ్చినవారి యభీష్టము నొసఁగకుండుటయే గాక రాజ్యమదంబున నన్నుఁదిరస్కరించి యమ్మాలెతల నిట్లు వాపోవఁగొట్టితివేల? శిరీషకుసుమశోభితకోమలంబగు నాయువతులంగొట్ట నీకు జేతు లెట్లాడినవి?

ఉ॥ మామకరోషవహ్నిపలు • మారును సుబ్బవోషంగఁ బేర్చినీ
వేమెయి నింకనాయెదుర • నెక్కడికేగెదు దుర్మదాంధ, యా
హైమవతీమనోరమణుఁ • డడ్డమువిల్చిన నిల్చు సందియం
బేమియులేదు పూని నిను • నిప్పుడె ప్రాభవహీనుఁజేసెదన్.

హరి—(విశ్చేష్టితుఁడై నిలిచియుండును)

సత్య—(హరిశ్చంద్రుని సమీపించి) మహారాజా! నీవధైర్యచిత్తుఁడవై చింతించుచున్నందువలనఁ బ్రయోజనములేదు. "అపరాధిని క్షమింపు"మని యిమ్మునిసింహుని బ్రార్థించుటయేకర్తవ్యము. ఈతనికోపవహ్ని కాలకూటవిషాగ్నుల గడచును. హరివిరించి పురందరాద్యమరులుగూడ నీతనికి భయమందుచుందురు. అపరిమిత మహిమాన్వితుఁడగు నీతఁడు రుద్రునకుఁదుల్యుఁడు-

మ॥ కరుణాపాంగ నిరీక్షణస్ఫురణ నీ • గాధేయుఁడాకృంత యా
దరవృత్తిం గనుఁగొన్నయంతటన మో • దంబార గల్యాణముల్
దొరకున్ మానవలోకసంతతికి న • స్తోక ప్రభావుండు, భూ
వర! యీపుణ్యుఁడయగ్రగణ్యుఁడరయన్ • వాచంయమశ్రేణికిన్.

హరి—(విశ్వామిత్రునిఁ జూచి) ముకుళితకరకమలుఁడై మహానుభావా! మీకోపమునకు త్రిమూర్తులే భయమందుచుందురు. అట్టిచో నేననఁగ నెంత!

తే॥ గీ॥ తనయుఁ డజ్ఞుఁడై చేయు • తప్పులెల్ల
గన్నతండ్రికి లోఁగొని • కరుణఁ గావఁ
జనదె? యిటు తూటికూరకుఁ • జంద్రహాస
మెత్తుదురె? యేల నామీఁద • నింతకినుక.

అజ్ఞానినై నేనొర్చిన యపరాధంబుల మన్నింపుము.

శా॥ మీరోషంబను శేషపన్నగము నా • మీఁదన్ వడిన్ రాఁగ, నో
కారుణ్యాత్మక! నేమహాభయమునం • గంపించుచున్నాఁడ, నన్
జేరన్ రమ్మని నమ్మఁబల్కి తలపైఁ • జేచేర్చి యూరార్చి నా
నేరఁబుల్ హృదయంబులో నిడక మ • న్నింపంగదే మ్రొక్కెదన్.

దుష్టశాత్రవుఁడైన శరణమందినచో, రక్షించుట పరమధర్మము గదా!

తే॥ గీ॥ తాపసోత్తమ నీదుచి • త్తంబు నాదు
భాగ్య మింద్రాదిదేవతా • ప్రణుతిఁగన్న
నిన్ను శరణంబు వేఁడెద • నీళ్ళుముంపు
పాలముంపుము! వేయును • బల్కనేల?

ఇదిగో! సుతసతీసమేతుడనై భవత్పాదారవిందంబులబట్టి వేఁడుచున్నాను. రక్షించెదనను వరకును విడువను. అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ. (భార్యాపుత్రులతో విశ్వామిత్రుని పాదముల పైఁబడును.)

విశ్వా—(తనలో) పావనచరిత్రుఁడన నీతఁడే, ఈతని నింకట విడువ రాదు. ఎట్లయినను నాప్రతిన నెరవేర్చుకొనుటకుఁబ్రయత్నిం పవలయును. (ప్రకాశముగా) హరిశ్చందా్ర! లెమ్ము, లెమ్ము. (లేవదీసి) నీవు నాయెడల నపరాధము గావించియుండినను, నీదైన్యమునుజూచి జాలినొంది కరుణించితిని కాని, నాకుఁ బ్రియముగ నే జెప్పుకార్యము నీవు సేయవలయును.

ఉ॥ క్షోణితలేశ! నాయనుఁగు • గూతుల వర్ణన సేయనొప్పు న
ప్పాణిసిపుప్పబోములను • బల్లవపాణులఁ జారుసైకత
శ్రోణులఁ గీరవాణుల మ • దున్మదవేణుల సర్వలోక క
ల్యాణుల నీకునిచ్చెదఁ బ్రి • యంబున వారిఁ బరిగ్రహింపుమా.

నావాక్యముల నుల్లంఘింపక యామతంగకన్యలస్వీకరింపుము. నీచిత్తపరిశోధనమునకై యిట్లు బలుకుచుంటినని నీవు తలంచవలదు. నిశ్చయముగా నీ వా మానవతులం బెండ్లియాడి నాకానందము గూర్చుము

హరి—(తనలో) అక్కటా! ఏమిసేయుదును. ఇచ్చటినుండి తప్పించి కొనిపోకుండ నిమ్మునీంద్రుడేదియొ యొకయుపద్రవముగల్పిం చుచునే యున్నాడు. దుస్స్వప్నమున గాంచినదంతయు నిజ మగుచున్నది. (ప్రకాశముగా) మహాత్మా!

తే॥ గీ॥ క్షత్రియత్వముపర్జించి • సంయమీంద్ర!
తగునె నాకిప్పు డీమాలె • తలవరింప
నంటగారాని యన్వయం • బకట యెట్లు
తెలియ కీమాట మీరాన • తిచ్చితిరిట.

దేవా! నే నేకపత్నీవ్రతుండ. వంశాభివృద్ధికిగ దాపరిణయము ధర్మశాస్త్రములయందు జెప్పఁబడినది. ధర్మశాస్త్రానుసారముగనీచంద్ర మతిని వివాహమాడితిని. ఈమెయందు నందనోదయభాగ్యమందితిని.

వలసినభోగముల ననుభవించితిని. కుమారునకు యుక్తవయస్సువచ్చి నంతనే వీనిని రాజ్యపీఠంబున నాసీనుంజేసి పరమేశ్వర దాస్యమున దనువు గడపఁదలంచుచున్న నాకీనార్ధకమున జండాలవివాహము మెడకు గట్టి ఘోరనరకకూపమున ద్రోయుట మీకు ధర్మమా?

విశ్వా—(ఇంచుక కోపముతో) ఏమీ! నాకు దెలియని ధర్మములు నీకుఁదెలియునాయేమి? నాయాజ్ఞ ననుసరించి యీ వెలివాడలేఁ గురాకుబోఁటుల వరించి సామ్రాజ్యసౌఖ్యము ననుభవించుము. పరలోకసౌఖ్యమునమ్మి నేఁడుగలుగు లాభమును విడుచు వెంగలికలఁడె?

ఉ॥ నేరవుసౌఖ్యమంద ధర • నేప! యజ్ఞము బొందుమంచు నా
హారముమాని శ్లాఘ్యదవు • నాకటిచేఁగృశమై చరించుటల్
సారవివేకి మేతలఁప? • జయ్యన 'నా' యెలదీగెబోఁడులన్
గౌరవలీలఁ గైకొనుము • కాదనుమీ మఱిసంశయింపఁగన్.

నీతండ్రికి నేఁజేసిన మహోపకారము నెఱుంగుదువుకదా. నీవి యిందువదనలఁ బొందితివేని నిన్ను బొందితోడనే యమరలోకమునకంపెద.

హరి—మహానుభావా! నన్నేల యీలీల బలవంతపెట్టెదరు? కులాచారమునకు విరుద్ధముగా నామాతంగవామాక్షులఁ గొనుటకు నాచిత్త మంగీకరింపదు.

తే॥ గీ॥ కులముదిగదాచి యీమాలె • తలవరించి
కాంచు గీర్వాణలోకసౌ • ఖ్యంబు లెల్ల
బంతమున రాజ్యమైన వ • ర్జింతుగాని
చలముకోని యెన్నిచెప్పిన • గులమువిడువ.

విశ్వా—అట్లనా, కానిమ్ము. ఇంకనీవాడినమాటకుఁ దిరుగవలదు. ఆలస్యమొనరింపక నీరాజ్యమంతయు నాకు ధారవోయుము. నీకారణమున నాకు సామ్రాజ్యసౌఖ్యము దొఱకుచున్నది.

**హరి**—మునీంద్రా!

**మ.** తగ మీరాయాసతిసేయుకంటెను బ్రీత • స్తంబైనపుణ్యంబు లే
జగతిం గల్గునె నాకు బంధురతప • స్సామ్రాజ్యసింహాసనం
బు గురుప్రాభవలీలనెక్కి మిగులం • బొల్పొంది బ్రహ్మర్షివై
దిగధీశస్తుతకీర్తిగాంచిన మహా • తేజస్వివీ వారయన్.

మీయభీష్టముదీర్చుటచే శాశ్వతముగ నేను లక్ష్మీకటాక్షము నకు బాత్రుఁడనై కృతార్థుఁడ నగుదును.

ఉ॥ శ్రీలుదలర్చుచుండ ముని • శేఖర! మొన్నటిదాక మున్ను మీ
రేలినభూమికాదె యిది • యిమ్మని నన్ననసేల క్రమ్మఱం
బాలనమాచరింప మది • బాయక వాంఛజనించెనేని భూ
పాలలనామనోరమణ • సన్నిభ! గైకొనుఁడెల్ల రాజ్యమున్.

నాచిత్తశుద్ధి బరీక్షింపగోరి యిట్లుపలుకుచుంటిరిగాని, కాకున్న మీకేమి, ఆ చంచలమగు రాజ్యపరిపాలనముపై గాంక్షయొడమిట యేమి:

**విశ్వా**—(నవ్వుచు) విశ్వంభరాకళత్రా! ఈనేర్పుమాటలునాయెదుట జాగిరావు. నీవు సత్యసంధుఁడవని యింతవరకును జనులు చెప్పుకొనుచున్నమాట యిప్పుడు బొంకయ్యెనుగదా! ఇప్పుడేకదా రాజ్యమైన వర్జించెదనని పలికి మరల తప్పించుకొనుట కిట్టిమాట పలుకుచుంటివా? పోనిమ్ము "ఈమాటలతో నేమి పనియున్నది? బద్ధపూర్వితిని. మీవారినిమీరుపొం"డనిపలుకుము. నేనేగెదను.

**చంద్ర**—(హరిశ్చంద్రునితో - నెమ్మదిగా) ప్రాణేశ్వరా! ఇప్పుడాలోచించినందువలనఁ బ్రయోజనములేదు. పరమేశ్వరుడు మన హృదయపరీక్షకై యీగాథేయుని నియమించియుండెనని తలంచెదఁ. ఇఁక మీరేమియుఁ బలుకక రాజ్యమెల్లధారాపూర్వకముగ కౌశికునకు దానమొసఁగుఁడు.

చ॥ మును ధరయేలిచన్ననృప • ముఖ్యులనేకులు చర్చచేసినన్
జనవర వారిలోన విల • సన్మతిపారఁగు లెవ్వరైన సాం
పునఁదమకంట మంటిమొన • మోపఁగఁజాలినయంత మేరయున్.
గొనిచనిరే ధరాతలము • కొంకకమీా యిల దానమిచ్చుచోన్.

మున్ను మాయావామనవటుఁడై యరుదెంచిన శ్రీహరికి, బలిచక్రవర్తికి ధరాతలంబెల్ల దానమీాయలేదా?

ఉ॥ ధీనిధియైనవిప్రున క • తిప్రియలీల ధరిత్రియొక్కడన్
జేసెఁడుమేరయిచ్చినఁ బ్ర • సిద్ధయశస్థితివాఁడు పూని యం
భోనిధివేష్టితక్షితివి • భుత్వముమీాఁకుఁగఁదానయేలు భూ
దానముఁబోలలేవు మఱి • దానములెవ్వియు మానవేశ్వరా!

అసదృశవితరణమహిమ విరాజిల్లు మీా కీర్తిగాధేయునకు రాజ్యశ్రీల ధారవోయుఁడు.

హరి—(తనలో)

క॥ ఆహా! యీాసతిని హిత
వ్యాహారము లెంత యొప్పె! • ననుకూలవరా
రోహలు గలిగినఁ బతులకు
నూహింప నలభ్యవస్తు • వొకటియుఁగలదే.

ఇట్టి సతీమణిని గ్రహించుటచే నాజన్మ ధన్యత వహించినది. నిజేశ్వరుఁడు చేయుధర్మమున కభ్యంతరముగలిగింప నతని బుద్ధిననుసరించు సతీమణియే సాధ్వి. (విశ్వామిత్రునిఁజూచి) మునీంద్రా! నేనసత్యమాడను. ఇదిగో తాము కోరినట్లు రాజ్యశ్రీలనొసంగుచుంటిని. (సత్యకీర్తినిఁజూచి) సత్యకీర్తీ! హేమకలశముతో జలముదెమ్ము!

సత్య—(తెచ్చియిచ్చును)

హరి—(విశ్వామిత్రుని చేతిలో జలముపోయుచు) దేవా! దేవబ్రాహ్మణ క్షేత్రములుదక్క దక్కిన ధాత్రీతలము సర్వము బరమేశ్వరప్రీతిగా మీాకు సమర్పించితిని.

విశ్వా—(తనలో) ఔరా! ఈసత్యసంధత! ఇతని నేనెట్లు బొంకింపఁగ
లుగుదును. సత్యసూక్తి నిలబెట్టుకొనుటకు సర్వరాజ్యశ్రీలఁ
దృణప్రాయముగ వర్జించినాఁడు. (ప్రకాశముగా) రాజా! నీస
త్యసంధతకు సంతసించితిని; నీవిఁక బురంబున కరుదెంచి ప్ర
జలముందు నన్ను రాజుగాఁ బ్రకటింపవలయును.

హరి—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

---

రంగము:—[సింహాసనాసీనుఁడైన విశ్వామిత్రుఁడును, పౌరులు, హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, ప్రవేశించుచున్నారు]

హరి—(విశ్వామిత్రునిఁజూచి) మునీంద్రా! నీయభీష్టము ననుసరించి
నీకీరాజ్యమొసంగితిని. నేనింక సుతసతీయుక్తముగ గానలకేగె
దను. దయయుంచుఁడు పరిపాలనమునుగూర్చి నేను మీకంత
గాఁ జెప్పవలసిన యవసరములేదు. కాని ప్రజలను గన్నబిడ్డ
ల విధమునఁ గాపాడుమని మిమ్ముఁ బ్రార్థించుచున్నందుకు
మన్నింపగోరెదను. (సత్యకీర్తినిఁజూపుచు) దేవా! ఈతఁడు మీకు
సర్వవిధంబులఁ దోడుపడఁగలఁడు.

1 పౌరు—(హరిశ్చంద్రునిఁజూచి)

ఉ॥ సల్లలిత ప్రతాప, ఘన • సత్యవచోరచనాకలాప, మీ
చల్లదనంబునం బ్రదికి • సమ్మదమందగ నేటిదాక, మే
మెల్ల మనోరథంబులు న • హీనతఁ గల్గగ సౌఖ్యవృత్తిమైఁ
దల్లిమఱుంగుబిడ్డల వి • ధంబుననుంటిమి యేపుచూపుచున్

2 పౌరు—మహారాజా! శార్దూలమునకు సారంగము నప్పగించుచంద
మున యీమునీంద్రుని చేతులలో మమ్ముఁబెట్టి పోవుచుంటి
వా? నీవులేని యీపురంబున మేము వసియింపలేము. మమ్ము
గూడ నీవెంట గొనిపొమ్ము.

హరి—పౌరులారా! మీరు విచారింపవలదు.

ఉ॥ తోయజగర్భశోకదములఁ • దూరగనొప్పెడు పుణ్యమూర్తిగా
ధేయుఁడు మీర లీతనియు • దీర్ఘమహాత్త్వమెంచఁగలేరు,గాం
గేయవసుంధరాధరము • గెంటిన గెంటు సమర్థ్యనన్నుతా
మేయతప,ప్రభావమున • మిక్కిలి మేటి మునీంద్రకోటిలోన్.

కష్టములెవ్వియైనను గాపురము సేయుడు. (సత్యకీర్తిం జూచి) సత్యకీర్తీ! మునికుంజరునియొద్ద నీవతిజాగరూకుఁడవై యుండుము. ఆతనిచిత్తవృత్తి నెఱిఁగి ప్రవర్తింపుము.

సత్య—మహారాజా! బాల్యహితుఁడనై, మంత్రినై యొప్పుచున్న నేను మిమ్ము విడిచి యెట్లుండగలను? మిమ్ము విడచియుండుటకంటె నీకృపాణముచే గంఠంబు ఖండించుకొనుటమంచిది. (యొరనుండి ఖడ్గము దీయుచున్నాఁడు.)

హరి—(వారించి) ఓ శివా! ఏమి యీసాహసము! సకలముదెలిసిన నీవు యిట్లుచింతింప నర్హమా? పరమేశ్వరుని కృపవలన మనము త్వరలోనే మరలఁ గలిసికొందుము (విశ్వామిత్రునిఁజూచి) మునీంద్రా! ఇక మేము పోయివచ్చెదము.

విశ్వా—మంచిది.

హరి—(సతీసుతలనుజూచి) సతీమణీ! పుత్రకా! రండు.

(నడచుచున్నారు.)

విశ్వా—(తొందరగా గద్దెనుండిలేచి) హరిశ్చంద్రా! నిలువుము నిలువుము. (సమీపించి) ఔరా! ఎంత మాయకాడవు! మమ్ము వంచించి పోవుచుంటివా!.

హరి—మహాత్మా! అపరాధమేమి!

విశ్వా—ఏమని యడుగుచుంటివా? నేను మున్ను యజ్ఞార్థమడిగిన ధనము నీ యొద్దనే దాచియుంచితినిగదా! దానిని నా కీయకుండగనే పోవుచుంటివి. ఇదియేనా నీ సత్యసంధత! పరులధన

ముపైనీకింత యాశయేల? నాధనము హరించితివేని నీకు గలుష మొదవక యుండునా? ఇంతవఱకును నిన్ను సత్యసంధునిగా భావించితిని.

తే॥ గీ॥ ఎఱుఁగ కొదవించెనేనియు • వినకులేశ!
విప్రదత్తాపహరణ ము • ర్వీశ్వరునకుఁ
జాలఁ గల్మష మొదవు సం • శయము లేదు
వఱచి సర్వంబుబట్టినఁ • గఱవకున్న!

ఇప్పుడైనను నే దాచియుంచిన ధన మిచ్చిపొమ్ము.

హరి—(తనలో) అక్కటా! ఈమునీంద్రుఁ డకారణముగ నాపై జల మువహించినాడు. ఇప్పుడు నేనేమిసేయుదును? (దైవమును దేశించి) హా పరమేశ్వరా? నన్ను సిలుగులఁ బెట్టఁదలచితివా? (ప్రకాశముగా) మహాత్మా! నా రాజ్యసంపదలన్నియు నీకర్పించితిని. తృప్తినొందక నాయందేదియో కారణము లేని యపరాధము కల్పించుట ధర్మమా?

చ॥ ఉ॥ పతిమాలిమూర్తివని • యొందు దలంపులుమాని, భక్తి నీయడుగులుగొల్చి కీర్తిమహి • మాఘ్యుఁడనయ్యెదనంచు నున్న నాయెడ హృదయంబులోఁ గృప వ • హించితపోధనపర్య! నాకెకుంబెడదలుచుట్టి యిప్పు పయిఁ • బెట్టక యింతట దృప్తిబొందుమీ.

దేవా ! నేను పూచికపుల్లయైనను గొనిపోవుచుండుట లేదు. సమస్తము మీ యధీనము జేసితిని.

విశ్వా—(కోపముతో)

తే॥ గీ॥ రెయ్యముసఁ దొల్లి నీవు మా • కియ్యకొనిన
ధనము వేడిన నిట్లాడఁ • దగునె నీకు
సత్యవాచాధురీణత • జరపుదేని
విత్తమంతయుఁదెచ్చి, వే • వేగనిమ్ము.

అట్లుకాదేని యజ్ఞార్థము నే నీయలేదనిచెప్పుము. నీరాజ్యము నీకే యిచ్చివేసెదను.

హరి—(తనలో) ఇప్పుడు నే నేమనుటకును వీలులేక యున్నది. (ప్రకాశముగా) మునీంద్రా! నే నసత్యమాడను. సర్వము నీకర్పించి పురము వెడలిపోవుచున్న వాడనగుటచేనట్లుబలికితిని. మీరు నన్నుకారణముగ౽ జిక్కులపాలు చేయుచున్నారు. పోనిండు. తమదయ యిట్లున్నది. మీరాగ్రహింపవలదు. తమఋణము నెలదినములలోఁ దీర్చెదను. సెలవిండు.

విశ్వా—అట్లు చెప్పుము. అది మాకు సంతోషము. నీవుతీర్చెదవు గాని, యెట్లుతీర్చెదవాయని యాలోచించుచుంటిని.

హరి—మహానుభావా! మీ కీయాలోచనయేల? ఋణవిముక్తుఁడనగుట యేకద మీకుఁ గావలసినది. భిక్షాటనము చేసితీర్చెదను.

విశ్వా—అది యీ రాజ్యమునఁ జేయరాదు.

హరి—మఱియొక ప్రదేశమున.

విశ్వా—బిచ్చమెత్తిన నింతసొమ్ము లభించునా? రాజా! ఈయవస్థ లన్నియు నెందుకు? నాతనూజలగు మాతంగకన్యకలబరిణయం బాడుము. నిన్నుపరదేవేంద్రునిగ జేసెదను

హరి—మునీంద్రా! కరుణించి యింక నాప్రశంసవిడువుఁడు. నేనుచెప్పి నగడువులో మీఋణము నొసంగజాలకయున్నమమ్మమ్మెయై నను మీధనము గైకొనుఁడు ఇక మేము పోయివచ్చెదము.

(ఇంచుక నడుచును)

విశ్వా—రాజా! మాట- మాట-

హరి—మహాత్మా! ఏమిసెలవు?

విశ్వా—ఒక్కసంగతిమఱచితిని. నీవునిరంతరభోగపరాయణుఁడవు. దరిద్రదశవచ్చినను, జిత్తము పూర్వపువైభవముదెసకే పరు గెత్తుచుండును. నీవాయాప్రదేశములయందార్జించుచుండు ధన మువెచ్చింతువేమోయను సంశయముకలుగుచున్నది. కావు

నీవెంట నాశిష్యుని నొకనిపంపెదను. నీకెప్పుడు దొఱికిన ధనమప్పుడే యాతని కిచ్చుచుండుము.

**హరి**—దేవా! మీచిత్తమువచ్చినట్లు సేయుఁడు.

**విశ్వా**—(ఎదుటఁజూచి) నక్షత్రకా!

**నక్ష**—(ప్రవేశించి) గురువుగారెందుకో పిలిచినారే.

**విశ్వా**—ఏమిరా! ఇంతయాలస్యమొనరించితివేమి!

**నక్ష**—ఆశ్రమమునుండి యీపురమునకుఁ దీసికొనివచ్చితిరి. "పాటిమీదగంగానమ్మకు కూటిమీదనేలోకము" అన్నమాట తమరెఱుగరా యేమి! తెల్లవారేటప్పటికిచద్దిమెతుకులు లేకపోతే ప్రాణం గిజగిజ కొట్టుకొంటుంది. అందుకని ఆప్రయత్నంలో వున్నాను.

**విశ్వా**—ఇంతకు దింటివా!

**నక్ష**—తినుటచేతనే స్వరము బాగా వచ్చుచున్నది.

**విశ్వా**—ఈమాటలకేమికాని, నిన్నొకకార్యమునందు నియోగించుచున్నాను.

**నక్ష**—విద్యతప్పమఱెందులోఁ బ్రవేశపెట్టినను చుఱుకుగా బనిసేయగలను. నాజాతకములో విద్యారేఖ లేనేలేదు.

**విశ్వా**—ఈహరిశ్చంద్రుఁడు మనకు ధనమీయవలసియున్నది. నీవీతని వెంటనరిగి దీసికొనిరమ్ము.

**నక్ష**—ఇంతేకదా. ఇచ్చేదాక నీళ్ళుతాగనిచ్చెదనా? (ఇంచుకయూరకుండి) స్వామి! స్వామి! చలిదిభోజనమునకు నిబ్బందిలేకుండ మాత్రముచేయుమని చెప్పండి. ఇంతకును నాకుబత్తెమున్నదా?

**విశ్వా**—నీకేమియు లోటుండదు. (హరిశ్చంద్రునిఁజూచి) హరిశ్చంద్రా! ఈనక్షత్రకుఁడు కడుసుకుమారి. ఎట్లుచూచెదవో!

హరి—స్వామీ! ఆతని కేవిధమయిన లోటు కలుగనీయను. (నక్షత్రకునిజూచి) మునిబాలకా! నీవు భయమునొందనవసరము లేదు.

నక్ష—అవునులే. అయిన అంత్యనిష్ఠురముకన్న ఆదినిష్ఠురము మేలన్నారు. ముందుగానే చెప్పియుంటే మంచిది.

హరి—(విశ్వామిత్రునిజూచి) దేవా! ఇఁక పోయివచ్చెదము.

విశ్వా—మంచిది. (నక్షత్రకునితో రహస్యముగా) ఓరీ! మార్గమున హరిని ననేకకష్టములపాలుచేసి యెట్లయినను నీతనిచే బొంకింపవలయును.

నక్ష—చేసెప్రయత్నమంతయు నందుకేకదా. నాతెలివి తమకు దెలియదా?

విశ్వా—(హరిశ్చంద్రునిజూచి) ఇఁక మీ రరుగవచ్చును.

(హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహి, నక్షత్రకుఁడు, నిష్క్రమింతురు)

విశ్వా—(తనలో) హరిశ్చంద్రుని చిత్తశుద్ధి నా కత్యద్భుతము గొలుపుచున్నది. కాలినున్నదినెత్తికెత్తుకొన్నను దేవసభామధ్యమున నీతని బొంకింతునని ప్రతిజ్ఞచేసితిని. ఇంతవఱకును నా ప్రయత్నములు విఫలమయినవి. (కొంచెముసేపూరకుండి) కానిమ్ము. ఆతనిని బెట్టవలసిన కష్టములన్నియుఁ బెట్టెద. సత్యకీర్తిని రాజ్యపరిపాలనము జూచుచుండుమని చెప్పి, నేనుగూడ నదృశ్యాకారుఁడనై హరిశ్చంద్రుని వెంటనుండి యంతయు వీక్షించుచుండెద. (నిష్క్రమించును)

ఇది ద్వితీయాంకము.





# సత్యహరిశ్చంద్ర



## తృతీయాంకము.



రంగము—[అరణ్యము—హరిశ్చంద్రుఁడు—చంద్రమతి—లోహితాస్యుఁడు—నక్షత్రకుఁడు—ప్రవేశించుచున్నారు.]

హరి—(తనలో) అక్కటా! ఎట్టియవస్థ సంభవించినది! అరణ్యమార్గమంతయు దుర్గమంబై, భీషణ పాషాణకంటకానేకవల్మీక తరుషండములచే నిండియున్నది. ఉష్ణకిరణుఁడు తీవ్రాతపము గాయుచున్నాఁడు. వాపీకూపతటాక పద్మాకర తరంగిణీ ప్రవాహంబులు శుష్కీభూతములైయున్నవి. దుష్టమృగోత్కరము లెల్లెడల విచ్చలవిడిగాఁ జరించుచున్నవి. (చంద్రమతినుద్దేశించి, తనలో) చండకిరణుని వేడిమిఁగందిన శరీరమునఁ జెమ్మటలు గ్రమ్మ, బాష్పబిందువులు పాలిండ్లపైఁబొరల, కుమారునిఁ జంకనిడుకొని, యిటుగొక యామడగా నడచుచు వచ్చుచున్న యీసతీమణిం గాంచిన నాకెంతయుఁ జింతకలుగుచున్నది.

సీ॥ భాసురమణిమయ • ప్రాసాదనిశ్రేణు,
లెక్కంగ నోపదీ • యిందువదన
కోమల శశికాంత • కుట్టిమస్థలములు,
మెట్టంగ నోపదీ • మెఱుఁగుఁబోఁడి
మందిరారామసీ • మావిహారంబుల
విహరింపనోపదీ • విద్రుమోష్ఠి

పోషిత నవశిర • పోతంబు కెంగేల
ధరియింపనోప దీ • హరిణనయన
తే॥ గీ॥ నగము లేకతి నారోహ • ణంబుజేసి
మొనసి యేమూడ్కి గమనించి • మొరపనేల
భయద కాంతార భూము లె • బ్భంగి గతిసి
కొడుకు నేచందమున నెత్తు • కొనియువచ్చె.
అంతటి మహారాజగర్భమునఁ బుట్టి, చక్రవర్తినగు నాకు భార్యయై యీామె యిట్టికష్టముల నందుచుండెను కదా!
సీ॥ తుమ్మెద గుంగుగెల్చు • ధమ్మిల్ల బంధంబు
చెదిరి కుంతలములు • చిక్కుపడియె
శశిబింబకాంతికి • సరసమై కనుపట్టు
వదనపద్మము వసి • వాళ్ళువాడె
క్రొక్కారుమెఱుఁగుఁ గై • కొనని తనూవల్లి
నిబిడాతపంబుచే • సొబగుదూలె
కెంద మ్మిపూవుల • గెలువంగనూహించు
మృదుపాదతలములు • మిగులచొక్కె
తే॥ గీ॥ పచ్చివాడంపుఁ గెంజాయ • పగటిమోవి
కగిలి బీటలువాఱవి • భ్రమము దఱిగె
తరళనేత్రకు నా నిమి • త్తమున నకట
యకటకెంత్రైన యీాయాస • మావహిల్లె.
చంద్ర—నాథా! విచారించుచుంటిరేల?
హరి—రమణీ! నామూలమున నీకిట్టియిక్కట్లుసంభవించెనుకదాయని విచారించుచుంటిని.
చంద్ర—ఆగర్భశ్రీమంతుఁడవును, సప్తద్వీపసముద్రముద్రితమహీచక్రము నిరంకుశము నేలు చక్రవర్తివియు నగు నీవే యిట్టికష్టముల నొందుచుండగా.. నన్నుఁగూర్చియా చింతించుచుడుట. నాథా? నన్నుగూర్చి చింతింపవలదు. ఇట్టిసమయము

నందే ధైర్యముండవలయును కష్టసుఖములు కాపురమందు నవికావు.

హరి—(కుమారునిజూచి) కుట్టా! మందిరంబునఁ బరిచారకులు నిరంతరము నిన్నుగ్రిందకు దింపకుండ నెత్తుకొని సేవలజేయు మహాభోగివైయుండు నీవు మాగర్భవాసమున బుట్టుటచే నిట్టియిడుమలకు బాలైతివికదా!

నక్ష—(కపటాయాసమునటించుచు) అమ్మయ్యా! ఇక్కడకునాపనిముగిసినది. ఇకనొకయడుగైన నవతలఁబెట్టజాలను, అయ్యో! ముల్లుకాబోలు. (విశ్వామిత్రునుద్దేశించి) ఓయి విశ్వామిత్రమునీంద్రా! ఇట్టికష్టములుపడుమనియా నన్నువీరివెంట బంపితివి!-

(నేలగూలబడును)

హరి—నక్షత్రకా! నీకువచ్చినభయమేమి!

నక్ష—ఓరాజా! ఏమిభయమని యడుగుచుంటివా? మీకుమారుని ముద్దులాడుచు మీగోడవలో మీరుండి నను మఱచిపోయితిరి. నేనెటుబోయినమీకేమి? నాప్రాణములు పోయినచో మిమ్ము ఋణమడుగువారుండరని తలచితిరికాబోలు.

హరి—మునికుమారా! ఈమాటలేల? నీకేమికావలయును?

నక్ష—అబ్బా!

చ॥ అలసితి నింక నొక్కయడు • గైనను నేనడువంగనోప మై
గలయగ ఘర్మబిందువులు • గ్రమ్మెఁ బదంబులఁ బొక్కులుబ్బె శీ
తలనవిధుమాహ వి • తానమునీడకు నన్నుజేర్పు భూ
తలపతిముఖ్య! దేహమున • దాహభరంబు జనించె నెంతయున్.

హరి—నక్షత్రకా! రమ్ము. ఆచెట్టునీడ నిన్ను విశ్రమింపఁజేసెదను.

నక్ష—నడుచుటకోపికయున్న నీ యేమిపెందుకు!

హరి—నే నెత్తుకొని తీసుకొనిపోయెదను. (ఎత్తుకొనుచున్నాడు.)

నక్ష—చచ్చినగేదెదూడను లాగినట్లు లాగకుము.

హరి—(చంద్రమతినిఁజూచి) తన్వీ! కుమారు నెత్తుకొని నెమ్మదిగా నావృక్షమునీడకు రమ్ము. (నక్షత్రకుని చెట్టునీడఁ బరుండ బెట్టును.)

చంద్ర—మునిబాలకా! ఇప్పుడుకొంచెము వల్లగానున్నదా?

నక్ష—నోటమాటరాకున్నది. (హరిశ్చంద్రునిఁజూచి)

తే॥ గీ॥ నీకు మత్ప్రాణరక్ష యి • వేకమాత్ర
సంభవించినయేని, వి • శ్వంభరేశ!
మేటిజవమునఁ నరిగి యె • చ్చోటనైన
విమలజలములు దప్పికి • వెదకి తెమ్ము.

(కన్నులుమూసికొనును)

హరి—జనపదమును చేరకుండగనే మునిసుతుడిక్కడ బడలిపడినాడు. ఈతనికె పథపరిశ్రాంతి యెట్లడంగును? అక్కటా! విశ్వామిత్రుఁడీ బ్రహ్మచారిని మనతో బంపినాడు. ఏమియుపాయము వాటిల్లునో!

చంద్ర—

మ॥ నిరవద్యస్థిర సూనృతోక్తిరచనా • నిర్నిద్ర! ధాత్రీతలే
శ్వర! నక్షత్రకుఁ డెంతయుం బడలె • దీవ్రంబైన యెండన్ దనూ
స్ఫురణం బెల్లనడంగె, నింకనడువం • బ్రొద్దేమియున్ లేదు, భా
స్కరబింబం బపరాబ్ధికిం జనియెఁ గం • జాయల్ విడంబింపఁగన్.

తే॥ గీ॥ మునికుమారుండు డస్సిన • మోస మరయ
కెంపు దూలంగ నీక నడి • పింప రాదు
పుత్త్రునినైన విడిచి న • పుత్త్రుకు నిపు
డేలమి రక్షింపవలయు నే • డిచటనిలిచి.

కావున నీవా ప్రాంతమున నెచ్చటనైన జలంబులగొని తెచ్చి యీ తనిదాహము దీర్పవలయును. సత్వరముగఁ బోయిరండు.

హరి—నీవతనియొద్దనుండుము. నేను జలము సంగ్రహించుకొని సత్వరముగా వచ్చెదను—(నిష్క్రమించును)

(తెరవాలును)

---

రంగము:—(దంతఘాతుకుఁడు కపటముని వేషముతోఁ బ్రవేశించును)

దంత—(తనలో) విశ్వామిత్త్రమునీంద్రుఁడు, సూర్యుఁడస్తమించువ ప్పటికి హరిశ్చంద్రుని నెట్లయిన మాయజేసి భేతాళవటము క్రిందకుఁ జేర్పుమని చెప్పినాడుకదా. (చూచుకొని) నాముని వేషము బాగుగనేయున్నది. ఇక్కడ నేను తపముజేసికొనుచు నున్నవానివలె నటించెద.

(కూర్చుండును)

హరి—(ప్రవేశించితనలో) అక్కటా! ఎక్కడను జలము లభ్యము కాదయ్యెను. ఏమిసేయుదును. జాగై నచో మునికుమారున కేమిం హానికలుగునో. (ఎదుట కపటఋషినిఁజూచి) అదిగో! అక్క డ తాపసపుంగవుఁ డొక్కఁడున్నాడు. ఈ మహాత్ముని జేరి ప్రా ర్థించెదఁగాక! (దంతఘాతుకుని సమీపించి) ఓ తాపసోత్త మా! నానమస్కారము లందుకొనుము.

చ॥ విలయకృశానుతుల్యమగు • వేడిమి నీ నిబిడాతపంబు మి
క్కిలి తపియింపఁజేయు నతి • శోషముగొంచె శరీరమెల్ల మీ

లలితకృపావలోకనము • ల న్ననుఁగన్గొని నామనంబు శీ
తలముగఁజేసి వత్సలతఁ • దద్దయుఁ బ్రీతి ననుగ్రహింపరే.
జలార్థినై యరణ్యమంతయుఁ జరించి, మత్పూర్వకృతసుకృతం
బున మిమ్ముఁగంటి.

చంత—(కన్నులువిప్పిచూచి) రాజా! నీవృత్తాంతమంతయు నాకు
దివ్యదృష్టిని గోచరమైనది.

సీ॥ సాంద్రకీర్తిప్రథఁ • జక్రవర్తిత్వంబు,
గనిన హరిశ్చంద్ర • మనుజపతివి
నీవు ప్రదాతవై • నిఖిలరాజ్యము నొక్క
తాపసవరునకు • ధారవోసి
యతనికి మున్ను మ • ఖార్థమిచ్చెదనని
పలికిన విత్తంబు • పడయఁగోరి
పురమువెల్వడి సతీ • పుత్రికయుక్తుండ
వైవారణాసికి • నరుగుచుండ

గీ॥ ధనమునకుగాగ నీమీద • దపసియాజ్ఞ
బైకరువచ్చి మునితనూ • భవుఁడునొచ్చి
ఘనపిపాసాతురుండైనఁ • గాంచిబెగడి
వచ్చితివి నీరువెదక భూ • వరలలామ.

హరి—(ఆశ్చర్యము నభినయించి) తపోధనులకు మీకు విశదముగాని
దేమున్నది? మహాత్మా! నీపావనచరణారవిందములకు నమ
స్కరించుచున్నాడను.

ఉ॥ ఈవన వీధులన్ వెదకి • యేను జలంబులు దెచ్చునంతకున్
జీవమునిల్పనోపఁ డల • సెన్ మునిపుత్రుఁడు దప్పిజెంది తే
జోవిజితార్క! నాకపయ • శోదురితంబులు రాకయుండ, మీ
పావనకుండికాజల మ • పారకృపారతిఁ బోయఁగాదగున్.

అదియుంగాక, నే నీరాత్రి తమ యాశ్రమంబున వసించుట కనుమతింపఁగోరెదను.

దంత—(నవ్వుచు) రాజా! కాననంబుల మునివృత్తిఁ బూనియున్న మాయాశ్రమంబులందు స్త్రీ జనముతో నీవు విహరింపరాదు. అది మాకపాయము. అదియుంగాక—

మ॥ సలిలంబల్పము మత్కమండలువులో • సర్వంసహాధీశ! త
జ్జలపానంబున మానినందనున కే • చందంబునం దీఱెడిన్
దలమై పర్విన దప్పి; యప్పలుకుఁ దా • సర్కించినం బుద్ధియే
తెలియంజెప్పెద నీటికందువ మనో • దేశంబు మోదింపఁగన్.

ఇచ్చటికి గూతవేటుదూరమున నిర్మలజలహ్రదమున్నది. తత్తీరంబున విశాలశాఖలచే విలసిల్లు నొకవటోర్వీజమున్నది. ఈరాత్రి నీవచ్చట పుత్రకళత్రనక్షత్రకసహితుఁడవై విశ్రమింపుము. పొమ్ము.

హరి—చిత్తము. (నిష్క్రమించును)

దంత—(నిష్క్రమించును)



రంగము—[మఱ్ఱిచెట్టుక్రింద హరిశ్చంద్రుఁడు చంద్రమతీలోహితాస్య నక్షత్రకులతో బ్రవేశించును]

నక్ష—రాజా! జలముదెచ్చి దాహమార్చి ప్రాణములునిలువబెట్టినావు. ఇప్పుడు మాటలాడుటకుఁ గొంచెము శక్తిగలిగినది. (ఇంచుక యూరకుండి) హరిశ్చంద్రా! నేటికి మనము పురము బయలు దేరి యిరువదిదినంబు లయ్యె. మనమిక నెప్పటికి గాశీపురము జేరుదుము? ఎప్పటికి నీవు ఋణము దీర్పఁగల్గుదువు? నా కేమియుఁ దోచకయున్నది.

హరి—నక్షత్రకా! మనము రేపే వారణాసికి బయలుదేరుదము. ఈ రాత్రికి మనమిచ్చట నుందము. మీరు మార్గాయాసమున మిగుల

దస్సియుంటరి. మృగబాధ కలుగకుండ మిమ్ము నేనురక్షించు చుండెదను. మీరు నిద్రింపుడు.

సత్య—అబ్బా ! కాళ్లులాగుచున్నవి. (లోహితాస్యునిజూచి) ఓరీ! బ్రాహ్మణుఁడను. కొంచెము కాళ్లుపిసికిన నీకుఁబాపము రాదు.

చంద్ర—బ్రాహ్మణోత్తమా! పసిబాలుఁడు వాడేమి చేయగలడు. నేనే నీచరణంబు లొత్తెదను. (నక్షత్రకుని గాళ్లుపట్టుచున్నది.)

నక్ష—పాపము! నోట వ్రేలుబెట్టిన గఱవలేను.

లోహి—అమ్మా ! ఈబ్రాహ్మణుని పాదములు నేనొత్తెద. నీవు నిద్రింపుము.

చంద్ర—నాయనా ! నీవు నిద్రింపుము.

నక్ష—(గుఱ్ఱుపెట్టి నిద్రబోవును.)

హరి—సతీమణీ! మునికుమారుడు నిద్రించుచున్నాఁడు. ఇఁకనీవుగూడ పరుండుము. నేను ఖడ్గధారినై మిమ్ము రక్షించుచుండెదను.

చంద్ర—(నిద్రించును)

హరి—(దిక్కులుచూచుచు తనలో)

సీ॥ కంధరపటలసం • కాశంబులగు సంధ
కారముల్ తోరణ • గట్టెదిశల
వ్యోమసీమంబెల్ల • దామమై తారక
స్తోమముల్ నిండి తో • డ్తోనపొదలె
ఖరహాగ్ని శిఖలచే • వేఁగి రథాంగ
పరంపర లిర్గుల దుః • ఖంప దొడఁగె
భీకరానేక వ • ల్మీకరంధ్రంబులు
వెడలి చరించె ద • ర్వీకరము లు

సీ॥ పెల్లుఝిల్లీవిరావముల్ • పిక్కటిల్లె
మిగుల దఱచుగ ఘూకము • ల్మెలగియాడె
సిబిడముగ శాకినీఢాకి • నీపిశాచ
భూతభేతాళ సంచార • ములుచెలంగె.

(ఆలుబిడ్డలఁజూచి) అక్కటా! వీరికెట్టిగతిపట్టినది!

తే॥ గీ॥ అధికమైన పథశ్రాంతి • నాదమఱచి
సుప్తినొందెను వీరికి • చోటుదుష్ట
మృగపిశాచ భయం బంకు • రింపకుండ
గావఁదగు నాకు జాగరూ • కత్వమునను.

(చెట్టువంకఁజూచి) ఏమిది! ఈవృక్షముపైనుండి యూడలను బట్టుకొని భూతములు దిగుచున్నవి ఓహో! ఈవటము భూతములకు నిలయముకాబోలు! వీనిం దునిమెదఁగాక. (నిష్క్రమించి వెంటనే ప్రవేశించును.)

(తెరలో)

శా॥ ఎట్టెట్టూ మిమునొక్క మానవుడు దా • నెంతే నహంకారియై
చిట్టల్కొందెగియింత చేసెనె కదా • భీభత్సరూపంబుగా
గట్టాయేగతి నింక వాడు నిలువం • గానేర్చునాముందటన్
జటల్చ్రెదఁ బొట్టప్రచ్చెద భుజా • శౌర్యం బవార్యంబుగన్

హరి—(తనలో) ఓహో! వాడెవఁడో భూతములకు నాయకుడు కాబోలు. రానిమ్ము మత్కరవాలమునకు బలియిచ్చెద.

భేతా—(ప్రవేశించి యట్టహాసముసేయుచు)

ఉ॥ వెట్టితనంబుగాక యర • వింద జుకైనను జేరరానినా
మట్టికెలంకుల న్మనుజ • మాత్రునకున్ నిలువంగవచ్చునే
యిట్టికినుండ శక్యమగు • నేనివరింప సివంగిచెంగటన్
జుట్టెదఁ దత్తనూపలల • శోణితధారలు పొట్టనిండఁగన్.

శా॥ ఇం దాశూలికినైన విచ్చలవిడిన్ • హేలన్ జొరన్ రాదు ని
స్సందేహంబుగ నావటంబు నను డే • జాడన్ బ్రవేశించెనో
యెందున్నిక్కలి యద్భుతంబు మదినూ • హింపంగవంటింటిలో
గుండేల్వచ్చిన చందమయ్యె నిది పెక్కు • ల్మాటలింకేటికిన్.

(హరిశ్చంద్రునిఁజూచి) అరే! దురాత్మా! మానవాధమా! నా వటంబుక్రింద నుండుటయేగాక నాయనుచరులను శిక్షించితివిగా? భేతాళుడున్న సంగతి నెరుంగవా?

హరి—ఓరీ! నక్తంచరా! నిలువుము (తనలో) వీనితో నిక్కడ యుద్ధ మొనర్చితినేని వీరందరును మేల్కాందురు. కావున నావలకు దీసికొనిపోయి వీనిగర్వమడంచెదగాక. (ప్రకాశముగా) దుష్ట నక్తంచరా! రమ్ము, నీకావర మడంచెద. (ఈడ్చికొనిపోవును)

నక్ష—(లేచి) ఓయి బాబో! ఇక్కడపిశాచము లున్నవికాబోలు. ఏమమ్మా! చంద్రమతి! లేవమ్మా కట్టువాడా! లెమ్ము హరిశ్చంద్రుడా! మమ్మిచ్చెట్టుక్రింద దించితివి.

చంద్ర—(లేచి) నక్షత్రకా! భయమందవలదు.

నక్ష—నాశరీరము కంపమెత్తుచున్నది. చెట్టునిండా భూతములే. ఏడీ హరిశ్చంద్రుడు? నన్ను దెయ్యములకప్పగించి యేమూలకరిగి నాడయ్యా!

హరి—(ప్రవేశించి) నక్షత్రకా! భయమందవలదు. మీరునిద్రించుచుండగా భేతాళుడిటకు వచ్చినాడు. వానిగర్వమడంచి వచ్చినాను.

నక్ష—అమ్మ బాబో! భేతాళుడే! మరలరాడుకదా! రాజా! నన్ను మాత్రము వానిపాల్పెట్టకుము.

లోహి—నాన్నగారూ! ఇక్కడ దయ్యములున్నవా?

హరి—వత్సా! భయములేదు. అమ్మపక్కనుండుము.

సతీ—రాజా! నాకు భీతిగనున్నది. నన్నుగట్టిగ కౌగిలించికొనుము. త్వరగా తెల్లవారిన బాగుండును. (ఇటునటుజూచి) ఈనిశకుదోడు వర్షముకూడ కురియ నారంభించినదే! అయ్యో! సామాన్యవర్షముకాదు. రాజా! చూచెదవేమి!

హరి—సతీ! ఈయవస్థయేమి! వర్షముధారసముద్రమువలెఁ బ్రవహించుచున్నది. గాలికిఁ జెట్లు పడిపోవుచున్నవి.

సతీ—రాజా! ఈచెట్టుపడిపోయినదో నేనుచచ్చెదనేమో. నాకట్టిగతి గూర్పవలదు.

హరి—భయమందక నాతోగూడ నీచెట్టుక్రిందనుండుము. (చంద్రమతినిజూచి) సఖీ! కుమారునినెత్తిని గుడ్డమైన గప్పుము. తడియుచున్నాఁడు.

సతీ—రాజా! ఎంతవఱకును మాకాయుష్యము మాకారోగ్యమేనా. మీపిల్లవానికి జలుబుచేయునేమోయని జాగ్రత్తపడుచుండిరి. ఇక్కడనన్ను జూచువారెవరుని తల్లియా దండ్రియా! ఇన్ని చిక్కులుపడుదునని తెలిసినదో రాకయేయుందును. అబ్బా! (వడకుచు) చలి చలి! చచ్చిపోవుచున్నాను.

హరి—నక్షత్రకా! పరమేశ్వరుఁడు మనయందున్నాఁడు. అదిగో! వర్షము తగ్గిపోవుచున్నది.

విశ్వా—(ప్రవేశించి తనలో) ఆహా! హరిశ్చంద్రుని ధైర్యస్థైర్యములు మిగులనద్భుతము గలుగఁజేయుచున్నవి. దంశఘాతుకుని బంపితిని. భేతాళుని నియమించితిని. భయంకరవర్షము ం చితిని. ఒక్కింతయు జలింపడయ్యె.

తే॥ గీ॥ తగిలి నాచేయు కపటకృ ♦ త్యముల నొగిలి
చిక్కఁడయ్యె వృథాశ్రాంతిఁ ♦ జెందెనకట

వెడఁగవై యీయరుంధతీ ♦ విభునితోడ
కలహమేల యొనర్చితిఁ ♦ దెలియలేక.

**మ॥** పురుహూతాది సుపర్వులున్ మునిజనం ♦ బుల్ భీతిఁబొందంగ, నే
దురహంకారము రాజసంబుఁ బలముం ♦ దోడ్తోనుబ్బంగ, దు
ష్కరసంధావచనంబు లేమిటికి మా ♦ త్సర్యంబునం బల్కితిం
జిరకాలార్జితమైన మత్తపము సం ♦ క్షీణంబు గాకుండునే.

కార్యాకార్యము లెఱుంగక పెద్దలతోఁ గలహించువాఁ డపజయంబును బొందకయుండునా? వసిష్ఠునిప్రతిజ్ఞ ఎఱవేరునట్లున్నది. (ఆలోచించి) ఏమీ! ఈ గాధిపుత్రుఁడు పట్టినప్రతిన విడుచునా! కానిమ్ము ఇంతటితో నేమయ్యె. అగ్నిహోత్రుని వశపఱచుకొని దావానలము గల్పించెదఁగాక. (నిష్క్రమించును.)

**హరి**—సతీమణీ! వర్షముపూర్తిగానడంగినది.

**ఉ॥** నారెకు గూయఁజొచ్చెఁ బరు ♦ షధ్వనిఁ గుక్కుటరాజి మౌక్తిక
శ్రీరుచి వేగుచుక్క పొడి ♦ చెఁ దలచూపె ననూరురేఖ కా
సారతరంగిణీవిటపి ♦ సంతతి బర్వె శకుంత నాదముల్
దూరములయ్యెఁ జీకటులు ♦ దూరుపు దెల్లవహించె వేకువన్

**లోహి**—నాయనగారూ! తడిసినగుడ్డలుగూడ నిట్టెయారిపోయినవి.

**నక్ష**—ఇక మనము ముందుకు సాగిపోవుదము రండు.

(అందఱు నడచుచున్నారు.)

**హరి**—అదిగో! సూర్యభగవానుఁడుగూడ నుదయించినాఁడు.

(మంట కనిపించును.)

**నక్ష**—(ముందుజూచి) రాజేంద్రా! ఇదియేమి! వర్షమాగినదని సంతోషించుచుండఁగా నెక్కడనుండియో దావానలము బయలుదే

రిన జే. ఓహో ! అభంగురములగు విస్ఫులింగములు ధగ ధగాయమానంబులై యున్నవి. మంటలు మింటినంటుచున్నవి..

చంద్రి—అక్కటా! ఈ కార్చిచ్చు నలుదెసల బొదవుచున్నది.

లోహి—అమ్మా! ఈమంటలను దాటి మనమావలబడుటకు మార్గము గనిపించకయున్న జే.

హరి—రమణీమణీ ! ఎటుసూచినను నీ భీకరదావానలము మనలను జుట్టుకొనుచున్నది. విధాతవ్రాతను నెవ్వరుఁ గడువజాలరు కదా!

తే॥ గీ॥ తరళలోచన! కాశికా • పురము జేరి
ఋషిశిఖామణి కౌశికు • ఋణముదీర్చి
నిత్యసత్యవచఃకీర్తి • నెడగకుండ
నిచట నంకిలియయ్యెనిం • కేమియనఁగ.

కురంగాక్షి! మనకుఁ బ్రాప్తింపనున్న యీ యపాయమునకు నేను చింతింపనుకాని బ్రాహ్మణకుమారున కాపదకలుగునని నేను చింతింతును.

నక్ష—(ఇటునటు బరుగెత్తుచు) ఓ రాజా! నేను మాతల్లి కొక్కడనే పుత్రుఁడను. నేను బుద్ధిగడ్డితిని యిట్లువచ్చితిని. ఇంకముందెన్నడును రాను. నేనగ్నిలోఁబడి దగ్ధముగాకుండఁ గాపాడుము. చూచెదవేమి! మంటలు మీాదికివచ్చుచున్నవి.

హరి—(చంద్రమతిని జూచి) తరుణీ! ఇంక మనమాలోచించుచు జాగుజేసినందువలన లాభములేదు. ఇతరమార్గాన్వేషణము మాని, నేనీయగ్నింబ్రవేశింతును. పిదప హవ్యవాహనుఁడు మీాయెడల గరుణించును.

చంద్రి—(విచారముతో) నాథా! ఎంతమాట వక్కాణించితిరి.

తే॥ గీ॥ ప్రాణనాయక! ధైర్యంబు • పాయఁబెట్టి
యివ్విధంబున నానతి • యియ్యఁదగున
నిమిషమైనను నినుబాసి • నిల్వఁజాల
నేనచొచ్చెద నీవహ్ని • లోన మున్న.

లోహి—నేనరిగి యీయగ్ని నార్పి వచ్చెద.

చంద్ర—(హరిశ్చంద్రునిఁజూచి) నాథా! నాయుద్యమమునకు మీరంతరాయము గల్పింపవలదు. మీరు కుమారుని మునిసుతుని రక్షించి మిమ్ము రక్షించుకొనుఁడు.

హరి—హా! నారీమణీ! అగ్నిసాక్షిగఁగైకొన్న నిన్నగ్నిహోత్రున కొప్పగింతును. నీవాక్యములువిని నాహృదయము పగులకయున్నది.

చంద్ర—నాథా! మీరు చింతింపవలదు. మనకు నిందరాకుండ నక్షత్రకుని బ్రదికింపుడు ఆలస్యమునకు గాలము కాదు. (లోహితాస్యునిఁజూచి) కుమారా! మీతండ్రిగారియొద్ద నుండుము. నేనిప్పుడే వచ్చెదను. (నిష్క్రమి)

హరి—హా! చంద్రమతీ! సతీ! హరిశ్చంద్రుఁ డెంతకఠినచిత్తుఁడు!

చంద్ర—(అగ్నిని సమీపించి చేతులుజోడించి)

సీ॥ పరమపావన తేజ • పావక సదయాత్మ
హరిణాంకమౌళి ప • ర్యాయకాయ!
యనఘ పాతివ్రత్య • మున మనోవాక్కాయ
కర్మకస్ఫూర్తిచే • ధర్మనిరతి
బూని చరించితి • నేని మత్ప్రాణేశ్వ
రుండు సూనృతవచో • రూఢిమెఱసి
భూనుత కీర్తి వి • భూతిశోభితుఁడేని,
సితకరాకృతి మాని • శిష్యునకును

గీ॥ విశదవాత్సల్యమున మున్ను • కుశలమొసఁగి
పిదప గౌశికుఋణము సం • ప్రీతిఁదీర్పఁ
గూడునట్లుగఁ బెనిమిటిఁ • గొడుకుఁగరుణ
నరసిరక్షింపవయ్య జో • హారునీకు.

దేవా! నేనెన్నిజన్మము లెత్తుచుండినను నాకు సత్యవ్రతాచారపారీణుఁడగు హరిశ్చంద్రచక్రవర్తియే ప్రాణేశ్వరుఁడగునట్లు ప్రసాదింపుము. (అగ్నిలోఁబడును)

లోహి— నాన్నా! అమ్మ అగ్నిలో బడినది.

హరి— కష్టము! అతికష్టము! (ఇంచుకయూరకుండి తనలో) మంటలరణ్య మెల్లెడ నావరించినవి. హా! చంద్రమతీ! నీముఖేందుమండలము జూచుట నేటితోడనే సరియైనదా?

వసి— రాజా! అటుజూడుము. మంటలు తగ్గిపోవుచున్నవి.

హరి— హవ్యవాహనుఁడు చంద్రమతిని భస్మముజేసి తృప్తిజెందినాడు. కాబోలు.

లోహి— తండ్రీ! అదిగో! అమ్మ.

హరి— (ఆశ్చర్యమునభినయించి) తండ్రీ! మన యదృష్టవశమున మీయమ్మ యగ్నింబడి దగ్ధముగాక నిలిచినది.

చంద్ర— (హరిశ్చంద్రునిసమీపించి) ప్రాణేశ్వరా! నమస్కారములు. (కుమారునిఁజూచి) వత్సా! (ఎత్తుకొనును)

హరి—

ఉ॥ ఓ వనితాశిరోమణి! ప • యోరుహలోచన! నీ సుశీలతా
శ్రీవినుతప్రభావమున • జేసి మహాద్భుత మావహిల్లగా
నీవనపావకం బడఁగె • నెల్లశుభంబులు గల్గునింక నీ
పావనవర్తనంబు కడుఁ • బ్రస్తుతికెక్కు ధరాతలంబునన్.

రమణీ! నాకపకీర్తి రాకుండ మునిబాలకుని రక్షించితివి ఇంక

నేను మునిరుణమునుండి విముక్తుడనై యశమందగలుగుదును.

విశ్వా—(తనలో)

తే॥ గీ॥ లోలలోచన మిసిమింతు • రాలుగాక
వహ్నికీలలలో నిల్చి • వన్నెచెడక
యున్నదిదిచాల చిత్రమో • హో తలంప
వినియు గనియు నెఱుంగమి • వ్విధమునెచట.

ఈచంద్రమతిపాతివ్రత్యము నాతపోవిశేషమును మించియున్నది.

ఉ॥ ఇంక నుపాయమేది కల • దీకమలాప్తకులావతంసముం
బొంకగజేయ హేమగిరి • బోలెడుధీరత యంకురింప, నే
యంకిలిబొందకిట్టిభయ • దాపదలైనను నిస్తరించుచుం
శంకవహింపకుండెడిని • చంద్రమతీసతికారణంబునన్.

(హరిశ్చంద్రాదులకు గనిపింపకుండ నక్షత్రకుని రహస్యముగా బిలుచును.)

నక్ష—గురువరా! మనప్రయత్నములేమియు సాగునట్లు కానుపించదు.

విశ్వా—నేనును నదియే చూచుచున్నాను కాని యింతటితో మనము విడువరాదు. నీ వొకపనిమాత్రము చేయుము.

ఉ॥ నీ కపటక్రియామహిమ • నేర్పుదలిర్పగ జోకజేసి, య
స్తోకవివేక! భూరమణు • తోడుతగూడి చరింపకుండ నీ
కోకకుచాశిరోమణి నకుంఠితబుద్ధి నశేషధీరతా
శ్రీకమనీయభర్తృహిత • శీలను తంబెడబాపు చయ్యనన్.

(నిష్క్రమించును)

నక్ష—(హరిశ్చంద్రునిజూచి) రాజా! ఈప్రాంతమున నెక్కడనైన జలముండును కావున గొనితెమ్ము.

హరి—(నిష్క్రమించును.)

వసి—(చంద్రమతినిఁజూచి) అమ్మా! చంద్రమతీ! సాధ్వీత్వమునఁ బదునాల్గులోకములలో నీకెవ్వరును నీడు కారు.

ఉ॥ ఎట్టితపంబొనర్చెనో మ ♦ హింబరమేశుఁడు మెచ్చునట్లుగా
నెట్టివిశేషదానము ల ♦ హీనతఁజేసెనో యెట్టితీర్థముల్
మెట్టెనొ పుణ్యశీలమున ♦ మించి జగన్నుతిఁగాంచినట్టి యి
న్నట్టిపుదేవిగా బడసె ♦ భానుకులోత్తముఁడంబుజాననా!

మమ్మందర దావానలములో బడకుండరక్షించితివి. ఇందుకు నేను నీకు బ్రత్యుపకారము సేయుదును. నీవు నావాక్యముల ననుసరించి వర్తింపుము. నీ వీ హరిశ్చంద్రునితో నుండుటం జేసి బహుకష్టముల నందుచుంటివి. నీ వితని విడిచి సాకేతమునకు రమ్ము. విశ్వామిత్రునితో జెప్పి యీ కుమారునకు రాజ్యాభిషేకము చేయించెదను కౌశికుని రోషహుతాశన విస్ఫులింగముల నార్పుట కెవ్వరికినిఁ దరముఁ గాదు. ఇదియట్లుండుము. ఋణము తీర్మానము చేయుగడువుగూడ సమీపించినది.

చ॥ మునిఋణమేగతిన్ మొదలు ♦ ముట్టగదీర్చెద రొక్కచిన్నమున్
జనపతిచేతలేదు జల ♦ జాతదళాయతనేత్రి! యెవ్విధం
బున సమకూడెడిన్ మితికి ♦ బొంకగనేరఁ డొకింతయైన నీ
పెనిమిటి యిట్టిశీలమున ♦ బృథ్విజనింపగఁబోల దేరికిన్.

చ॥ అలుకజనింపఁ గౌశిక మ ♦ హాముని యేమరిపాట భీమభం
గుల జనుదెంచి మాధనము ♦ గొబ్బున దెమ్మని యాన బెట్టినం
గలుగుచు నేయుపాయమును ♦ గానక నిన్నును నీతనూజుఁ గొం
దలమున విక్రయించు నను ♦ బాధవు డెవ్వరికైనఁ జెచ్చెరన్.

కావున నంతవరకు రాకుండ నీవును నీనందనుఁడును సాకేతపురమునకు వచ్చి సుఖింపుఁడు.

చంద్ర—నక్షత్రకా! ఎట్టిమాటబలికితివి? సతి కిహపరసౌఖ్యములకు భర్తయేకదా మూలము. భర్తనెడబాసియున్న కాంతబ్రతుకు నిరర్థకము.

శా॥ వాలుఁగంటికి నింటియాతఁడు మనో • వాంఛాప్రదానక్రియా
హేలాలోలుఁడు నీలవేణికి బ్రియుం • డేప్రొద్దు నొప్పారు ర
త్నాలంకారము కాంతకున్ మగఁడు • నిత్యానంద సంపాదియుం
కేలా వేయును జెప్ప నేర్గడయు బ్రా • ణేశుండు తన్వంగికిన్.

కౌశికునిమాయ మమ్మేమియుఁ జేయఁజాలదు.

నక్ష—(తనలో) లాభములేదు.

హరి—(ప్రవేశించి) నక్షత్రకా! ఇవిగో జలములు. (చంద్రమతిం జూచి) రమణీ! ఇంక మనమీ ప్రదేశమున నాలస్యము సేయరాదు. సమస్తపాపనాశియు, విశ్వనాథునకావాసంబును, భాగీరథీస్రవంతీవిరాజితంబును నగు వారణాసికి బోవుదము.

నక్ష—నేనును నదియే చెప్పదలఁచుకొన్నాను. రండు.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.








## చతుర్థాంకము

**రంగము:**—(వారణాసీపురము. గంగాతీరము:—హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు—నక్షత్రకుఁడు ప్రవేశించుచున్నారు)

**హరి**—అబలా! పరమపావనియగు భాగీరథినిఁజూడుము.

ఉ॥ వారిధికూర్మిరాణి, రతి • వల్లభవైరికిరీటభాగమం
దారలతాంతమాలిక, జ • నంబులపాలిఁటి వేల్పుటావు, ధా
త్రీరమణీకుచాగ్రతట • దీపితమౌక్తికహారవల్లి, భా
గీరథి చెప్పనొప్పుసఁగు • కిల్బిషభూజకుఠారధారయై.

(గంగనుద్దేశించి నమస్కరించుచు)

శా॥ తల్లీ! మిన్నక నిన్ను నాడిన జనుల్ • తారర్థిగై వల్య భా
వ్యల్లక్ష్మిం దగజుట్టికొందురనిశ • వాంఛించి ప్రేమంబు సం
ధిల్లన్నిన్గనియాడువారి కరుదే • నిర్వాణ సౌభాగ్యముల్
కల్లోలాపహృతౌఘపంక! త్రిజగత్కల్యాణి! భాగీరథీ!

(ఇంచుకనడచి చంద్రమతినిఁజూచి) ప్రాణేశ్వరీ! ఈకాశీపుర వైభవము గంటివా?

శా॥ ఏతత్పట్టణవైభవంబు లలరన్ • హేలావతీధాతకున్
వాతాశప్రభుతారకాహితులకున్ • వర్ణింపఁగా శక్యమే
చేతోజాతభయంకరుండు సుజన • క్షేమంకరుం డిచ్చటన్
బ్రీతింగాపురముండు శంకరుఁ డుమా • బింబాధరాయుక్తుఁడై

ఈపురంబున మరణించినచోఁ బంచమహాపాతకుండయినను ముక్తిఁగాంచును.

సీ॥ తామ్మక్షరంబుల పాతు • గదలంగ నేవేళ
నోలిని సప్తవా • యువులువిసరు
ద్వాదశరూపముల్ • దాల్చి యుగ్రమయూఖు
డేవేళఁబచరించు • నెండఁగరము
దుష్కరంబులుగాఁగ • బుష్కలావర్తాభ్ర
జాల మేవేళ వ • ర్షములుగురియు
భువనంబులెల్ల నం • భోమయంబులుగాఁగ
విషరాశు లేవేళ • వెల్లివిరియు
తే॥ గీ॥ జంతునివహంబు లేవేళ • సమసిపోవు
సృష్టిమధ్యాంతభయదక • ల్పాంతవేళ
బొరయదాపద నణుమాత్ర • మునుకురంగ
నేత్ర! యికాశికాపుర • క్షేత్రమునను.

ఈపురబాహ్యసీమను వసించుచండాలునితోడనైనను నమరేంద్రుఁడు సమానుఁడుకాడు. ధర్మార్థకామమోక్షములిచట నున్నవి. (ఇంచుకనడచి) ఇదిగో! మనము విశ్వనాథుని దేవళము ప్రవేశించుచున్నాము.

(తెరలేచును. దేవాలయము)

హరి—(నమస్కరించి) హర! హర! మహాదేవ! శంభో!

చంద్రి—
లోహి—
(నమస్కరించుచున్నారు)

నక్ష—శంభో! శంకర!

హరి—(చేతులుజోడించి)

సీ॥ క్షీరాబ్ధిసంభవ • క్ష్వేళానలోగ్రకీ
లావళీనీలకం • ఠాజిరాయ!
పవనాశనాధీశ • పర్యంక కంకప
తాస్త్రమిత్రరిపు • రామరాయ!
మాళీందుచంద్రికా • జాలస్ఫురద్దేవ!
నిమ్నగాకైరవేం • దీవరాయ!
పావనాచార స • ద్భక్తలోకానీక
మానసాంభోజాత • మధుకరాయ!
తే॥ గీ॥ వసుమతీధరకన్యకా • వర్తులస్త
నాగ్రకాశ్మీర సురభిదో • రంతరాయ!
మందిరాయితకైలాస • కంధరాయ!
హస్తిచర్మాంబరాయ! తు • భ్యంనమోస్తు.

చంద్రి—హేవిశ్వనాథా! మత్ప్రియేశ్వరుని, సత్కుమారుని రక్షింపుము. తండ్రీ! మునిఋణముదీరఁజేసిఁ నానాథుని సత్యవ్రతునిగా పాడుము.

నక్ష—రాజా! ఇక్కడపనియైనదా?

హరి—ఇంక మనమరుగవచ్చును. జయ! శంకర!

(అందరు నిష్క్రమింతురు)

రంగము: –(రాజవీధి—హరిశ్చంద్రుఁడు—చంద్రమతి—(లోహితాస్యుఁడు—నక్షత్రకుఁడు ప్రవేశించుచున్నారు.)

నక్ష—(హరిశ్చంద్రునిఁజూచి కోపముతో) రాజా! నేనెంతపలికినను నీవు ప్రత్యుత్తర మీయకున్నావు.

చ॥ ధరణిప! నేఁడు నెల్లియును • దక్కువగా నెలనాళ్లునయ్యె నే
నరసితి లెక్కబెట్టి మఱి • యీయను లేదొక పీసమైన నే
నెరవున నింక మాఋణము • వేగమె తీర్చెదొ కాక మిన్న కే
సురిగెదవో వివేకగుణ • శూన్యతఁ బొంది యసత్యవాదివై.

"ఆలస్యాదమృతంవిష"మను నార్యవాక్యము నీవుకనియుండ లేదె? గడవుదినంబు దప్పెనేని మునిసింహుని వలనఁ బ్రమాదముగలుగుట నిక్కము. ఇక్కడికివచ్చిన నాటనుండియు దేవతారామములు, తీర్థములు సందర్శించుచు గాలము గడుపుచు మాయప్పసంగతి మఱచినాడవు. ఇయ్యది నీకుధర్మమా!

చ॥ ఇఁక నొకమాట నాత్మనొక • యించుకనిల్పక క్రూరవృత్తిఁగా
శికమునిమీద నానయిడి • చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా
యక జహబాధలన్ బొదలు • నట్లుగ జేయక మాధనంబు రా
దకటనృపాల! యిట్లుతగ • వా? ననునిష్ఠురుఁ జేయనేటికిన్.

గాధేయుండెప్పుడువచ్చునో? వచ్చినంతనే యిదె గైకొమ్మని ద్రవ్యమిడకయున్నచోఁ గోపస్వాంతుఁడగును. ఆతనికోపము నడంచుట కా పురారికైనఁ దరముకాదు.

హరి—నక్షత్రకా! తొందరపడవలదు. నేనును దత్ప్రయత్నమునందే యుంటిని.

నక్ష—ఏమిప్రయత్నము! జపహోమనియమము లన్నియు మాని నీతోడ గురుండంపవచ్చితిని. వచ్చినందుకొక యఃరకాను ఋణా-

మైన నీవుదీర్చలేదు. నాకాగ్రహము వొడమకయుండునా? ఇదె, ఇదె యని నాచిత్తమునకు నొప్పిని కలుగఁజేయుచున్నావు. లేదేని నేనీయ నవసరములేదనుము. నాదారిని నేను పోయెద. కాకున్న నేడెట్లయిన దీర్పుము. జీతబత్తెములు లేనిబంట్రనై నీతో దిరుగుటకు నాకేమియవసరము?

హరి—(తనలో) హా! పరమేశ్వరా! నిరంతరము నీపదారవింద సేవ దప్ప నన్యమెఱుంగని నాకిట్టి కష్టములు గూర్ప న్యాయమా? దేవా! ముని ఋణ మేగతిని దీర్తును? పుత్త్రుండును గళత్త్రము దక్క దక్కిన విత్తమణుమాత్రము లేదు. భక్తరక్షణదక్షదీక్షా కంకణుండవగు నీవు నన్నుఁగాపాడి "హరిశ్చంద్రుఁడు సత్యవాగ్రతుఁ" డను జయస్తంభమెత్తింపఁజేయ నిదియేకదాసమయము! (విచారమునఁదలవంచి యూరకొనును)

చంద్ర—(హరిశ్చంద్రుని విలోకించి)

ఉ॥ నిండినవేడ్క లోకములు • నిత్యము సన్నుతిచేయ ధారుణీ
మండలమెల్లనేలిన స • మగ్ర యశోవిభవుండవీవు మా
ర్తాండకులేశ! మూఢుని వి • ధంబున భ్రాంతివహించి, చింతమై
నుండుట పాటికాదు; ధృతి • యుల్లమునన్ విలసిల్లజేయుమీ.

నాథా! నీవీభంగి దైన్యమునంది యాలోచించుచున్నందు వలనఁ బ్రయోజనమేమియున్నది; ఋణముతీర్చవలసినగడువు దినము రేపైయున్నది. ఏయుపాయముననైన మునిఋణము దీర్చి సత్యమును గాపాడుకొనుఁడు అప్పుదీర్పకయున్నచో గీడు వాటిల్లును. అదియుంగాక గడువుదినమున కొకగడియయైనను దాటరాదు. ఎట్లయిన మిమ్ము బొంకించుటకా కౌశికుఁడు ప్రతిజ్ఞబట్టి మనలనీరీతి దుర్భరకష్టములపాలు చేయుచున్నాఁడు. ఋణముదీర్పుమని నక్షత్రకుఁడు మిమ్ము నిష్ఠురోక్తులఁబలుకు

చుండెనని మీరు దుఃఖింపవలదు. మీ సత్యవచోవిభవప్రతి
ష్ఠకేయీతఁడు తొందరపెట్టుచున్నాడని తలంపుడు.

హరి—(నిట్టూర్పుపుచ్చి) హా! సతీ! గాధేయునియెడల నేనేమి మహా
పరాధమొనర్చితిని? నన్నుకారణముగ నిట్టివెతలకు బాలుసే
యుచున్నాడు.

చంద్ర—గాధేయుని కపటమంతయు మీసత్యపరీక్షార్థమే.

శా॥ కూపంబుల్ తగుతోటలుం జెఱువులుం • గుళ్లున్ ధరన్నిల్పఁగా
నేపుణ్యంబొనఁగూడు మర్త్యులకు ధా • త్రీశాన్వయగ్రామణీ!
యాపుణ్యంబరయంగ ప్రాప్తమగు ని • త్యస్ఫూర్తిమై సత్యభా
షాపారీణులకున్ వివేకము మదిన్ • సంధిల్ల నూహించినన్.

కావున మీ సత్యవాక్య గుణగౌరవసంపద యణుమాత్రము
పోకుండఁజేయుఁడు. ఏదియో యొకదారిఁజూచి నేడుకౌశికుని
ఋణముదీర్పకున్నఁ బ్రయోజనములేదు.

హరి—పల్లవాధరీ! ఎంతయోచించినను ఋణవిముక్తికి తెరువుగాని
పింపకయున్నది. హా! పరమేశ్వరా!

చంద్ర—నాథా! ఈసమయమున మీరుధైర్యమును జిక్కబట్టుడు.

తే॥ గీ॥ అర్థమున కిప్పు డొంటుభ • యంబులేదు
వినుము ధీరతతో నను • విక్రయించి
తీర్పు సగమైన నేడు గా • ధేయుఋణము
కడమ కొక్క యుపాయంబు • గలుగు నెల్లి.

హరి—హా! (మూర్ఛిల్లిలేచి) పద్మగంధీ! నీ వాక్యములు విని నాహృ
దయము వీలికయున్నది. అక్కటా! ఈ యనుచిత భాషణం
బులాడ నీకుబాడియా? అతిపౌరుష వచనంబులు నాకర్ణరంధ్ర

షులఁ బ్రవేశపెట్టి దురితము గట్టుకొంటివిగదా! ఈ హరిశ్చం
ద్రుఁడు కులకాంతను విక్రయించునంతటి కఠినచిత్తుఁడా!

చ॥ ఇలబరికించినంబతుల • కెట్టిపరియాసము బొందిమైనఁ గాం
తలఁదగుభంగిఁ బ్రోచుటయె • ధర్మము; లేమలవిక్రయించి యో
జలరుహనేత్ర! భర్తలకుఁ • జన్మసుఖస్థితిఁజెందియుండఁగా
నలికులవేణు లిందులకు • నందులకుం బరభోగహేతువుల్.

సతీమణి నమ్మి బ్రతుకఁదలంచువానికన్న పాపాత్ముఁడులేడు హా! ఇంతదారుణకార్యము నేనుచేయగలనా?

చంద్ర—నాథా! మీరిందులకు సందియమందుచు విచారింపవలదు.

చ॥ అంచితసత్యవాగ్విభవ! • యాపదఁజెందిన విత్తమెల్ల వ
ర్జించి కులాంగనం గరుణఁ • జేకొనఁగాదగు భార్యనైన ని
ర్వంచన విక్రయించి యని • వార్య వివేకకళాధురీణతా
భ్యంచిత వృత్తి భర్తకును • పద్రవముంబెడబాయగాదగుం.

భార్యావిక్రయపాతకము బాయుటకు మార్గమున్నది. కాని, మిథ్యావాగ్దోషము బాయుటకుమాత్రము మార్గము లేదు. అనృతభాషణునికంటె పాపాత్ముఁడును, సత్యవాచాన్వితునికంటె పుణ్యాత్ముఁడునులేడు. మోక్షలక్ష్మీసామ్రాజ్యమునందఁగోరు మహానుభావులు దారసుతాదులపై మోహలతలను ద్రెంపుదురు.

మ॥ ప్రతికూలోక్తులు పల్కఁగావలదు భూ • పాలాగ్రణీ! యిత్తరిం
ధృతి జిత్తంబుననిల్పి దిగ్భరిత కీ • ర్తిస్ఫూర్తితోఁగూడి సూ
నృతవాక్సంపదబొందు; భూజనులు వ • ర్ణింపంగ నామీఁదిమో
హతమఃపుంజముఁ బాపు, చిన్మయ వివే • కాదిత్యబింబంబుచేం.

నాథా! నీకునమస్కరించుచున్నాను. శీఘ్రముగ నన్ను విక్రయించి ఋణవిముక్తి నందుఁడు.

హరి—హా! కోమలీ! మొన్న నరణ్యమున భయంకరదావానలంబునఁ
బ్రవేశింప నిన్ను బంపినకఠినచిత్తుఁ డిప్పుడీ మహాదారుణకా
ర్యముఁ జేయుటకు సాహసింపఁడా!

శా॥ ఏణీలోచన! నానిమిత్తమున నీ • కీపాటుపాటిల్లెనే
క్షోణీనాథుల రాణివాసములు చ • క్షుఃకౌతుకావాది ని
శ్శ్రేణీలాలిత హర్మ్యవాటికలలోఁ • గ్రీడావిశేషంబులన్
బ్రాణేశాన్వితలై నిరంతరసుఖ • ప్రాప్తిన్ వినోదింపఁగన్

తే॥ గీ॥ సకలరాజన్య కన్యకా • జనములపుడు
నీకుఁ బరిచర్యచేయుచు • నెమ్మిఁగొలుతు
రుత్పలేక్షణ! యిపుడు ని • న్నొక్కరునికి
దాసిగా విక్రయింపంగ • జేసినజుఁడు.

మ॥ తనుమధ్యన్ హరినీలవేణి బిసహ • స్తం బక్వబింబోష్ఠిఁ జం
దనగంధిం బికవాణిఁ బీనకుచఁ గాం • తామౌళిరత్నంబు నా
కనువన్నెన్ మెలఁగంగనేర్పుగల రా • కాచంద్రబింబాననన్
నినుఁబాపెన్ విధి నేటితోఁ గలువకం • టీ! నిర్దయస్వాంతుఁడై

తే॥ గీ॥ తరుణి! నామాటకడుగేడు • దాటవెఱతు
నతివ! హామానసమున బా • యకవసింతు
వింతి! నాకన్నపెన్నిధి • వెన్నచూడ
లలన! నాపూజ్యసామ్రాజ్య • లక్ష్మినీవు.

సీ॥ మందిరారామ నీ • మంబులైవిలసిల్లు
భయదాటవులు పద్మ • పత్రినయన
కనకహర్మ్యంబులై • కనఁబట్టుసానువు
ద్గహ్వరాంతరములు • సింహమధ్య
పట్టెమంచముమీఁది • పఱపులైశోభిల్లు
భూరిపానుపులు క • ర్పూరగంధి
శాల్యోదనంబులై • చవులుపుట్టఁగఁజేయు,
శాకపాకాదులు • సదమలాంగి

తే॥ గీ॥ గరిమ నినుగూడి చరియించు • కతననాకు
నిందుబింబాస్య! యిన్నాళ్లు • కిపుడునేఁ-
బొగడదగు నాదు రాజ్యవి • భూతులెల్ల
నెఱయఁ బెడఁగాసిపోవుట • యెఱుకపడియె.

ఏణాక్షీ! నిన్ను బాసినచో నాప్రాణంబులునిలుచునా?

నక్ష—(కోపముతో)

శా॥ ఆలస్యం బొనరింపనేటికి? నృపా • లా! తెమ్ము మాసొమ్మువ
త్యాలాపంబులు నిల్వ దేని మతిమో • హంబిమ్యోడక మానువిూ
జాఁలింబొం దెద వాలినమ్ముటకు సం • సారంబుపై బ్రాంతినో
యీలాగుల్మఱిమెచ్చుగావు; తుదిని • న్నెంతైన బోనిత్తునే.

ఇక్కరంగాక్షిని నమ్ముటకన్న వేఱొకయుపాయమున ఋణము తీరదు. కావున విఫణివీధికరమ్ము.

ఉ॥ పోయినయంతమట్టునకుఁ • బోకడ పెట్టుము శీఘ్రవృత్తిమై
నీయుడురాజబింబముఖి • నేటికి నూరక మాటిమాటికిన్
మాయలుచేయ నీకునిది • మానవనాయక! హేయమైనగా
థేయునితోడ నొక్కమఱి • తెంపుననాడు మసత్యవాక్యముల్.
రమ్ము. (చేయిబట్టిలాగును)

హరి—నక్షత్రకా! ఇదే వచ్చుచున్నాను. భార్యనమ్ముటకు సాహసించితిని. (నడచుచున్నాడు.)

నక్ష—రాజా! మనము విపణివీధింబ్రవేశించినాము ఇకజాగొనరింప నేల?

హరి—కానిమ్ము ఈయువిదను విక్రయింపుము.
నక్ష—నేనా! సొత్తునకు హక్కుగలవాఁడవు నీవువిక్రయింపవలయును.
చంద్ర—నాథా! శంకింపక కార్యము నెసవర్తింపుడు.
నక్ష—భూపాలా! అందఱకును వినఁబడునట్లు గట్టిగా కేకవేయుము.

హరి—హా! ఎంతకష్టము! పరమేశ్వరా! నన్నిట్టిదీనదశకుఁ దెచ్చితివిః కదా! (అందరువినునట్లు)

ఉ॥ అత్రినమానులుగా రవిసు • ధాంశుకులీనులు మన్మథద్విష
న్మిత్రనిభార్థవంతులు స • మేయబలాఢ్యులునైన బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య[illegible]ద్రకుల • సంభవులార! మదీయభార్య స
త్పుత్రవతిన్ ధనార్థినయి • పోకడఁబెట్టెదరంచు విల్వఁగన్.

తే॥ గీ॥ స్వప్నమందైన [illegible]ంకని • చారుశీల
మహిఁ, పతివ్రతలకు తల • మానికంబు
ధర్మమార్గంబు తప్పని • ధన్యచరిత
విక్రయించెద గొనుఁడయ్య • వేగవచ్చి.

నక్ష—(ఎదుటఁజూచి) రాజా! ఎవరునురాకయున్నారు. ఎవరుమట్టు కువాకే యీమాటవిని గుసగుస లాడుకొనుచుఁ బోవుచున్నారు. (పరికించి] అదిగో! ఎవ్వఁడో యొకబ్రాహ్మణుఁడిట్లు వచ్చుచున్నాఁడు.

కాలకౌశికుడు—(ప్రవేశించి హరిశ్చంద్రునిజూచి) ఏమిటినాయనా! భార్యనమ్ముచున్నానని కేకలువేయుచున్నావు. ఇదేమికర్మము?

హరి—దేవా! నీవు భూసురుండ వగుటంజేసి నమస్కరించుచున్నాను

కాల—సరే. ఈయమ్మకమేమి! నీవెవ్వడవు. కులకాంతను విక్రయింపఁదలఁచితివి. ఏమో! నిన్నుజూచిన నాకనుమానముగనున్నది ఏదూరదేశమునుండియో యీయతివం దెచ్చి నాభార్యయని విక్రయించువిధము గనుపించుచున్నది. రాజభటులు జూచిరేని మోసము. ఈమెనిచ్చుటవిడిచి యెటకేనిపొమ్ము. కాదేని నేఁ జెప్పినట్లు చేయుము.

ఉ॥ బ్రాహ్మణసంగ నీవిక చ • పద్మదళేక్షణ ధారపోసి స
మ్మానమువిూఱ నాకొసఁగు • మా భవదీయ కృతాపరాధముల్

పూనికనేనుగ్రక్కొని పరి • భుత్వము గానబడంగనిల్చి యి
వ్వానికిలోఁగకెంత తొందర • వచ్చినగాచెద నిన్నుఁ గూరిమిన్.

అదియుంగాక నీవు రాయవలె నున్నాడవు కూలిపనులుచేయఁ గలవు. హాలికవృత్తికోపుదువు.

హరి—(భీకరముగా)

మ॥ అవివేకంబున విప్రలాపముల నే • లాపల్కెదీలాగునన్
రవివంశుండఁ ద్రిశంకునందనుఁడ నే • రాజ్యంబు పాలించువో
భువిలోనెన్నఁడు చోరశబ్దమువినన్ • భూదేవ! యిన్నాళ్లకున్
జెవిసోకెన్ మదిలో నసహ్యముగ నీ • చేతన్ మహాదోషముల్.

చ॥ అతిశయరోషసంయుతమ • హాహిభయంకరమండలాగ్రఖం
డితరిపుదంతికుంభతట • నిర్మలమౌక్తిక రాజిబూని యా
యతజయలక్ష్మికిన్ బరిణ • యాంగముగాఁ దలఁబ్రాలుపోయుపా
త్రితగల క్షత్రివంశజుక • రంబులుహాలికవృత్తికోర్చునో.

నన్నుగూర్చి మీరెఱుంగక యుంటచే నట్లువచించితిరి. ఏను హరిశ్చంద్రుఁడ. సత్యవాక్పరిపాలనార్థమై సమస్తరాజ్యశ్రీలు విశ్వామిత్రునకు ధారవోసితిని. మఱియు,

చ॥ అనిమిషలోకవర్ణిత మ • హామహిమాస్పదమూర్తియైన య
మ్మునికుల చక్రవర్తి కట • మున్ను మఖార్థము ప్రేమనిత్తునే
నని యొడబడ్డ విత్తమున • కర్థినుపాయము లేమి నీఁపహూ
జనమణి నమ్మఁబూనితి న • సత్యముబొంద మనంబు గొల్పమిన్

కాల—నీవు హరిశ్చంద్రుఁడవా? అందుకనే నీయొద్ద గొంత సత్యవాగ్విభవము కానవచ్చినది. కాని నే చెప్పుపలుకులు వినుము భార్యనమ్మెదనని వాడవాడలందిరిగిన జనులు పరిహసింతురు. అప్పుతీర్చలేకున్న వారుచేయగలిగిన దేమి! నీయొద్ద నేమియు నాస్తి లేదుకదా! అప్పు నెగగొట్టుమార్గము నీకు నేనుచెప్పెద.

సు. నీవుమాత్రము గృహిణి నమ్మవలదు. మఱియొకమాట.

ఉ॥ ఎంత పెనంగినన్ గృహిణి • యిప్పటి కమ్ముడుపోదు నా కుపా
యాంతరమేమియుండబోదము • దర్థము కూడదు కల్లలాడితిన్
బంతముతూలెనంచు మఱి • పల్కక మిన్నక యున్న నిన్ను భూ
కాంత! వధింపఁ గాజనెనె • కౌశికమానికి నింతయేటికిన్.

హరి—బ్రాహ్మణోత్తమా! నీయుపన్యాసము లోభగుణవర్తనులకే గాని నాకుపయోగింపదు. నే నీకాంతను విక్రయింపఁదలఁచితిని. నీవుకొనఁగలిగితివేని నైకొనుము లేదేని దయచేయుము.

కాల—(తనలో) విశ్వామిత్రుఁడు నన్ను బ్రేరేపించెనుగాని యాతని యాటలుసాగవు. (ప్రకాశముగా) రాజా! రోగికి బథ్యము రుచించదనునట్లు నావచనములు నీవు వినకయున్నావు. పోని మ్మెు, నాకేమి? ఈమెనెంతకు విక్రయించఁ దలచితివి?

హరి—మానవుఁడు కరిపై నెక్కి రత్న మంబరతలమునకు మీటినచో నెంత మొత్తరుగునో యంతసొమ్ము.

కాల—అబ్బో! చాలయున్నదే! వేరములేదా?

హరి—అంతియే. దేవా!

కాల—ఆపైక మెవ్వరికియ్యవలయును?

హరి—ఈనక్షత్రకున కొసంగుడు.

కాల—అబ్బాయీ! రా! పైకమిచ్చెదను.(చంద్రమతినిఁజూచి)అమ్మా నీపేరెవ్వరు?

చంద్ర—చంద్రమతి.

కాల—మంచిది. ఈకూరలమూట విస్తరులకట్ట నెత్తినిబెట్టుకొనుము (చంద్రమతి నెత్తిని మూటఁబెట్టుచున్నాఁడు)

హరి—(తనలో) హా!

చ॥ కలితశిరీషపుష్పమున • కంటె మృదుత్వముగల్గియున్న దీ
లలనశరీర మిట్టిశశి • లాంఛనబింబనిభాస్య నక్కటా
తలపయి మోపు మోవనిటు • తామర తూలియొన క్రొవ్వాత్మనూ
మ్మలికము లేకయీబరువు • మానవతీమణి యెట్లుపూనెడిన్.

లోహి—అమ్మా! నేనును వచ్చెదను.

చంద్రి—నాయనా! నీవు తండ్రిగారియొద్దనుండుము.

కాల—ఇదియేమి? ఈబేరములో పిల్లవాడు లేడా యేమి?

హరి—బ్రాహ్మణోత్తమా! నేను కాంతనే విక్రయించితిగాని కుమా
రుని కాదే.

కాల—బాగున్నది. ఆవును గొనునప్పుడు దూడను వేరుసేయుదురా?
రాజా! ఈధర్మోక్తి నెచ్చట నేర్చితివి.

నక్ష—రాజేంద్రా! దీనింగూర్చి మీరేలకలహింతురు? నేనుమధ్యవ
ర్తినై న్యాయము జెప్పెదనువినుడు. హరిశ్చంద్రా! నీవీమెను
విక్రయించునప్పుడు కుమారుఁడిందులోనివాడుకాడని తేటతె
ల్లముగఁ జెప్పియుండలేదు. అదియుంగాక గోవుతో వత్సము
కూడ కలిసియేయుండును. కావున నాత్మజసహితంబుగా నీత
నికి చంద్రమతి యమ్ముడువోయినది. ఇంక మారుమాటబలు
కక కుమారునింగూడఁ బంపుము.

కాల—నీవు వేయియేండ్లు వర్థిల్లుము. నిజము చెప్పితివి.

హరి—(తనలో)

తే॥ గీ॥ తగవు ధర్మంబు విడచి స • త్యంబువదలి
యితఁడు పిలువని పేరంట • మేగుదెంచి
పాడిఁజెప్పెదననుచు ద • బ్బరలు పలికె
గాలగౌశికునకు నిచ్చ • కంబుగాక.

అక్కటా!

తే॥ గీ॥ కరుణ వర్జించి మృగశాబ • కంబుగోత్రిలు
పులికినిచ్చినయట్ల యీ • పువ్వుబోడి
విక్రయింపంగవలసె బ్ర • హ్మసురునకు
దరమె యేరికిఁ గడవంగ • దైవఘటన

(ప్రకాశముగా) హాసతీ! పరమేశ్వరుఁడు మనమొడల నెంతనిర్ద యు వహించినాఁడు. ఈక్రూరకర్ముఁడింత కార్యమొనర్చియుఁ బ్రతికియున్నాఁడు. నిరంతర మదీయ చరణ సేవాసక్తచిత్తవగు నిను విక్రయించితినికదా! హా! కుమారా! లోహితాస్య! తండ్రికి దూరమగుచున్నను దల్లియొద్దనుండు భాగ్యమొకింత నీకున్నది.

చంద్ర—(శోకించుచు)

శా॥ ఓప్రాణేశ్వర! యోగభీరజలధీ! • యోధైర్యహేమాచలా!
యోప్రాలేయమరీచి రూపవిభవా! • యోరాజచూడామణీ!
యోప్రత్యర్థి మదేభపాటన హరీ! • యోనిత్యసత్య వ్రతా!
యోప్రాభాతదినేశతేజ! నినునే • యోజంబెడంబాయుదున్.

శా॥ దీపింపంగ నొనర్తు వెల్లపుడు న • ర్థిన్ మన్మనోమోదముల్
కోపంబింతయుఁ జూపనోడుదువు పె • క్కుల్ నేరముల్ గల్గినన్
నాపూర్వంబగు కర్మమెట్టిదియొ సం • తాపంబు పాలంబడన్
బాపెన్దైవము నేటితోడ నను నీ • పాదాంబుజద్వంద్వమున్.

నాథా! మీదివ్యపదారవిందసంసేవ నాకెప్పటికి మరల నొదవునో! మనము కౌశికసంయమీంద్రుని మాయాపాశంబుల లోఁ గట్టుబడితిమి. ఏదియెట్లయినను ధైర్యముమాత్రము వద లవలదు. సత్యమే మీకు శాశ్వతకీర్తి నిచ్చును. ఇంకమాపై బెంగవిడిచి యనుజ్ఞనీయుడు.

హరి—హా! ప్రాణేశ్వరీ! నన్నెడబాసిపోయెదవా!

కాల—(చంద్రమతినిఁజూచి) ఏమిది! మీరేడ్చుచున్న నాకు గాలహార ణమగుచున్నది. సత్వరముగ రాడు. (లోహితాస్యునిఁజూచి) పిల్లవాడ! ఈమాటను నీవెత్తికొనుము. ఇఁక రా! చంద్రమ తీ! కదలవేమి?

హరి—మనోహరీ! కాలకౌశికుఁడు తొందర పెట్టుచున్నాడు. ఆతని కాగ్రహము కలుగకుండఁ బొమ్ము. కుమారుని జాగరూకత తో నరసికొనుము.

చంద్ర—నాథా! పోవుచుంటిని

శా॥ శ్రీకంఠుండు పినాకపాణి గిరిశు • ం డ్రీవల్లభుండార్తి రి
క్షాకేళీనిపుణుండు బాలశశిలే • ఖామౌళివేదాద్రి సీ
మాకంఠీరవమూర్తి శంకరుఁడునే • మంబొప్ప సంప్రీతితో
నీ కాశీపురవిశ్వనాథుఁడును నీ • కిచ్చుఁ గా మనోభీష్టముల్.

మమ్ముమఱచినను నీవు సత్యమును మఱువవలదు. గాధినంద నుడు చేయుచున్న కపటకృత్యములలో జిక్కుకొనవలదు. ఇదియే నాకడసారిమాట. పోయివచ్చెదను.

లోహి—నాన్నగారూ! అమ్మతో వెళ్లివచ్చెదను.

హరి—తండ్రీ! పోయిరమ్ము. నిన్ను సర్వదేవతలు రక్షించెదరుగాక!

కాల—(చంద్రమతీ లోహితాస్యులనుజూచి) నడచుచుండుడు నక్షత్రకునిజూచి) నక్షత్రకా! ధనమిచ్చెద నిటురమ్ము.

నక్ష—(సమీపించును.)

కాల—(రహస్యముగా) నేను విశ్వామిత్రుని ప్రేరేపణమున వచ్చినా డను. తెలిసినదా?

నక్ష—తెలియుటకేమి! నీ మొగముచూడగనే గ్రహించితిని. అదియుం గాక మేమిక్కడకు వచ్చునప్పుడు గురువుగారు నాతో చెప్పి

నారు. ఇకనీవుపొమ్ము. ధనముముట్టినదని హరిశ్చంద్రునితో నేనుచెప్పెదనులే.

కాల—మంచిది. (చంద్రమతీ లోహితాస్యులతో నిష్క్రమించును.)

నక్ష—(హరిశ్చంద్రునిఁజూచి) హరిశ్చంద్రా! ఇక్కడికి గొంతవఱకు ధనము ముట్టినది.

హరి—నక్షత్రకా! కొంతయేమి! కౌశికుని ఋణమంతయు దీరినట్లే కదా!

నక్ష—కాదు. కాదు.

తే॥ గీ॥ కౌశికునియాజ్ఞ నీవెంట • గడఁబ్రయాస
మునజరించిన వానరం • బులకునెల్ల
బత్తెసెలవయ్యె ధారుణీ • పాల! యిపుడు
నీవు నాకిచ్చిన ధనంబు • నేటితుదకు.

హరి—నక్షత్రకా! నన్ను మన్నింపుము. కౌశికుడు నిన్నుఁ బంపున ప్పుడు నన్ను బత్తెమేమియు నీయమని చెప్పలేదు. అట్టిచో నీవు నన్ను గష్టపెట్టుట ధర్మమగునా?

నక్ష—నీవు వినలేదు. విశ్వామిత్రుడు రహస్యముగ ననుదినంబును నీయొద్ద బత్తెముగొనుమని చెప్పియేయున్నాడు. ఊరకనీవెంట దిరుగుటకు సేవకుఁడనా? ఎండవక వానయనక శీతవాతముల కోరి, మహారణ్య ప్రదేశములన్నియు నీవెంట జరించిన నాకు బత్తెమీయవలదా?

ఉ॥ సంతతవేదపాఠమును • సంధ్యయు వేల్మియు నజ్జగించి నే
నెంతయు మూఢవృత్తి • ధరణీశ్వర! పాపముగట్టుకొంటి, నీ
చెంతవసించి కౌశికుని • శిష్యులలోపల నేఁటిదాక ని
శ్చింతమతిఁ యథావిధిగ • జేయుదు దప్పక నిత్యకృత్యముల్.

నాకష్టమంతయు నీవు విచారించెదవని యూరకుంటిని. కాని యిట్లధర్మమునకు బాల్పడుదువని యెఱుంగనైతిని.

హరి——మునికుమారా! నీవిట్లు నిష్ఠురోక్తులాడిన నేమందును? దినగత్తైము నీకిత్తునని నేనొడంబడియుండలేను. గుర్వర్థమై నీవరుదెంచితివి. పరదేశవాసులకు చెట్లనీడలును, పత్రిములును, దేవతాలయములునుగాక మణిమందిరములు నున్నావా?

ఉ. నీకిటు నన్ను దూరజను • నే పలుచోటుల నీరసాన్నముల్
గాక సుఖప్రకారమున • గన్గగవేస్నె పాయసాన్నముల్
చేకొని యిండ్లవెంట దిర • సింపఁగ బిచ్చమునెత్తువారి క
య్యో కరుణింపఁ గావలదె • యోపికగల్గి యునఁటు లోపలన్.

ఇట్లుగాక నీవు నాకు [illegible]మే కావలసియున్నదో నేడాగుము. ఎట్లోయార్జించి కొంచెమిచ్చెదను. నేడొసంగిన ధనము మునిఋణముగ భావింపుము.

నక్ష——(నవ్వుచు) మంచిమాట చెప్పితివి చేతికిదక్కిన ధనము విడిచి మరలనీవెంటఁ దిరుగుటకు నేనేమిపాపము జేసికొంటిని. ఏమైనను సరే నీవిచ్చినదానిలో నొకగవ్వయైనను మునిఋణము లేదు. అది నాబత్తెమే నీవింక మునిఋణము దీర్పుము. లేదేని లేదనుము. అట్లు గాదందువేని నాతలఁగోసి నాయొద్దనున్న ధనము గైకొనుము

హరి——శివశివా! ఎంతమాట! (కొంచెమూరకుండి) మునికుమారా! ఈకఠినవాక్యములతోఁ బనియేమున్నది? చెడ్డకాపురమునకు ముప్పులేదు! భార్యనమ్మినసొమ్ము నీకు జిక్కినదికదా! ఇక మునిఋణము దీర్చుకొనదగు స్వాపతేయమునకు నేనొక యుపాయమేమియులేదు కావున నీ విచ్చవచ్చినవానికి నన్ను విక్రయింపుము. నిరవశేషముగా నప్పు దీరును. నేను కృతార్థుఁడనగుదును.

నక్ష——రాజా! అట్లు సత్యము నిల్పుకొనుము. రమ్ము.

(నిష్క్రమింతురు.)

గీ॥ వలవ దేనోఘములును నోవ • వనరుహాక్షు
లకు మనోహారుపదకమ • లంబులెపుడు
ముదమునొంది భజించిన • నదియెచాలు
తలచినంతనె నభిమతా • ర్థంబులొసగ.

అమ్మా! నామాటవిని యాగ్రహంబు మానుము.

కాల—అట్లు బుద్ధిచెప్పుము.

కల—(చంద్రమతినిజూచి) నిన్ను తిన్నదిన్నమని పిలువలేను. నీపని నీవు చేసుకొనుము. నీవేమి చేయగలవు?

చంద్ర—అమ్మా! నీవేమి పనులు చెప్పిన నవియన్నియును జేయుదును. సాధ్వీత్వమునకు భంగము రానీని యెడలనైనను సరే.

కల—ఆపనులన్నియు పిమ్మట నున్నదిగా చెప్పెదను.

కాల—నీవు కష్టపడిపోవుదువనియే గదా దాసిని గొంటిని.

కల—నామీద ప్రేమ నీకు నుండిపోయున్నది. ఇక స్నానమునకు నీళ్ళ లన్నియు మింగుదువుగాని.

(అందఱు నిష్క్రమింతురు)

చతుర్థాంకము





# సత్యహరిశ్చంద్ర

## పంచమాంకము.

---

రంగము:—(విపణివీథి—హరిశ్చంద్రుఁడు—నక్షత్రకుఁడు)

న.—ఎంతకేకలు వేసినను నెవ్వరును రాకయున్నారు. కానిమ్ము. మరల కేక వేసెదను. (హరిశ్చంద్రుని హస్తముఁ బట్టుకొని)

సీ. బ్రాహ్మణక్రియమెప్పు వి • శ్వామిత్రమునిశిఖా
మణికి నర్పించిన • మంచిదాత
నేనుగవ్వులను వి • జృంభించి ఒహాఁజను
స్తంభముల్ నిల్పిన • శౌర్యశాలి
భేతాళుఁడను పేరి • భూతంబు దెగఁగాచ్చి
మునుల భయంబు మా • న్పిన మహాత్ముఁ
నిత్యసత్యవ్రత • స్తుత్యుఁడై కీర్తి వి
స్ఫూర్తిచే వెలసిన • పుణ్యమూర్తి

తే. గీ. సర్వకులవార్ధి పూర్ణేందుఁ • డగు త్రిశంకు
కూర్మిపట్టి హరిశ్చంద్రు • కువలయేశు
విక్రయించెద నడిగిన • విత్తమొసఁగి
గరిమ గొనరండు పౌరులో • కంబులార. !

ఎవరును వచ్చుటలేదు. (పరికించి) ఎవ్వఁడో చండాలుఁడు కా బోలు మదిరాపానవశంబున గొడలు తెలియక పదములు పాడుచు నిల్లు వచ్చుచున్నాడు.

వీరబాహు—(ప్రవేశించినతుత్రకుని సమీక్షించి) ఏంటయ్యా! బాపన యయ్యా! కేక లెడ్తుండావు?

నక్ష—నీవెవరవు? దూరముగా నుండుము.

వీర—ఓసబో! నంగతేంటొ సెప్పు.

నక్ష—ఈతఁడు హారిశ్చంద్రుఁడు. విశ్వామిత్రున కీయవలసిన ఋణముకై యితఁడమ్ముడు వోవుచున్నాడు

వీర—అల్లా సెప్పు. మరిగంతే సరేగాని, నువ్వడిగినసొమ్మిత్తాను, ఈతఁడు నానుసెప్పినపనులు సేస్తూయుంటా. తెలిసిందా. సూడు మరి బేరాలు సారా గొప్ప. ఒకమాట. తొరగా కానియ్యాలి.

హరి—(కోపముతో వీరబాహునిఁజూచి)

శా॥ ఓరీమాల! దురాత్మ! నీ మనములో • నొక్కంత యుగ్ శంకలే
కీరీతి దురహంకృతిన్ బలుక నో • రెట్లాడెరా నీకు నా
హా! రాజీవసభాన్వయుణ విలువ నీ • వర్హుండవే సొమ్మునన్
జేరన్ రాకుము మద్యపానకృత దు • శ్చేష్టావికారంబునన్.

నే నెక్కడ! నీ వెక్కడ! ధనమిచ్చుటెక్కడ! పొమ్ము.

వీర—ఏంగిమాటలు! శండాలుడనంటావు. నాసంగతి నీకు తెలియదు. ఈమాటలుకట్టేసి విచ్చామిత్రియ్యాలప్పు తీర్చాలనుంటే నాదగ్గిఱకురా. డబ్బిత్తా.

నక్ష—రాజా! వీనికంటె నిన్ను గొనువా రెవ్వరును రాకున్నారు. కావున నే నీతనికి నిన్ను విక్రయించెదను.

హరి—హా! నక్షత్రకా! చండాలునకు విక్రయించెదవా?

నక్ష—

గీ॥ మును నాతోడుత నీవు పల్కిన క్రమంబుం గాంగదె భూపాల! యె
వ్వనికైనన్ నను విక్రయింపుమని గర్వంబున్ ప్రసంగించి నీ
వనవే యీగతి నేటికిం దిరుగ సత్యప్రాప్తి బోనాడి, యీ
తని సింహాసనపు మాటిమాటికిని నిందల్పల్కె నీకేటికిన్.

ఇతడెవ్వండైననేమి! ధనముం మాకు చెల్లించినవాడే మాన్యుండు.

శా॥ ఈ చండాలునిచేత పూర్ణధనము నే డిప్పించెదో కాక నీ
వాచాడంబరమెల్ల మాని యనృత వ్యాపారశీలుండవై
యాచంద్రార్కము ధాత్రిపై నిలుచు సత్యస్ఫూర్తి వర్జించెదో
ధీచాతుర్యము మీఱి సిందొకటి సద్ధింబూనుమా చెచ్చెరన్.

వీర—అట్లా సెప్పయ్యా! బాపనయ్యా డబ్బెంతన్నావు?

నక్ష—మానవుడు కరినెక్కి రత్నమంబరమునకై మీటిన నెంతపైకెగురునో యంతధనము——

వీర—సరే. ఇత్తాను కాని కట్టిమాత్రము సూడు. ఈతనియూరుపేరు తెలియదు. పెళ్లాంబిడ్డ లెక్కడో? యిల్లాకోట్టి నమ్మకోవాలి. సరిగా నామాట యింటాడా? నాల్గురోజులుండి పాటిపోతాడా? అసంగతి కనుక్కోమటి.

నక్ష—రాజా! ఈతనికి నీవు నమ్మబలికి మాటిమ్మిప్పింపుము.

హరి—(తనలో) తుదకెట్టిసి చస్థితి సంభవించినది! కానిమ్ము. నేటితో గాధేయుమాయాపయోరాశి నుత్తరించెదగాక! (వీరబాహునిం జూచి) మతంగనాయకా! నామీదనీకు నవిశ్వాసము వలదు.

త్యజ్ఞానములు నాకు జననీజనకులు. వినయార్జవములు హిత
సుతులు. శాంతియే భార్య.

ఉ॥ వాసరవల్లభాన్వయుఁడ • వర్జితదోషుఁడ సార్వభౌముడన్
భాసురసూనృతప్రతిభ • బాయక జాలక చేరి నీకు నే
దాసుడనయ్యెదన్ ఏమను • తప్పనిమాటయు నాకుఁ బూటయిా
భూసురబాలకాగ్రి శికిఁ • బొందుగనిమ్ము ధనమ్ముసర్వమున్.

చ॥ హృదయములో పలం గపట • మించుక యేనియు నిల్పకెంతయున్
సదమలభక్తియుక్తి నని • శంబును బాయక నీదుసేవ సే
యుదు మఱి సేయకుండిన మ • హోగ్రతనాదుశిరంబుద్రుంచినీ
పదములమీఁద నిల్పెదను • బాలసుధాకరమౌళిసాక్షిగన్.

వీర—మంచిది. విశ్వామిత్రబాపనయ్యకిత్తాను. ఇక నాదగ్గఱనీవుయిా
రదాసుడవు నేనుతో వుండు. రా! (నక్షత్రకునిఁజూచి) రా
సామిన్నిత్తాను.

(అంకఱునిష్క్రమించి వెంటనే ప్రవేశింతురు)

నక్ష—

తే॥ గీ॥ ఇనకులాధీశ! నీవు మా • కియ్యకొనిన
విత్తమంతయు నేఁడు ప్ర • వేశమయ్యె
శంకరుఁడు విశ్వనాథుండు • సాక్షిగాగ
నిలుపుకొంటివి సత్యంబు • నిత్యముగను.

ఇక నేను పోయివచ్చెదను.

హరి—నక్షత్రకా! దయయుంచుము. గాధేయునకు నాభక్తిపూర్వక
నమస్కారముఁ జెప్పుము.

నక్ష—(తనలో) మాగురుఁడూ కూర్చుని గుప్పిట్లులాట తెచ్చుకొన్నా
డు. హరిశ్చంద్రునిఁ బోకించుట కెవ్వరికిని దరముకాదు.

(నిష్క్రమించును)

వీర—(హరిశ్చంద్రునిజూచి) వీరదాసా! నువ్వు నమ్మకమైనకోడికిమల్లే నేవున్నావు ఇక్కడిస్మశానమంతా నా హక్కే. తెలిసిందా• కాని మాడ యియ్యందే చచ్చినోళ్ళని తగలెయ్యకూడదు. అక్కడని కారం నీకిచ్చాను. ఈరోజులగాయతు అక్కడుండు. ఇదిగో! ముద్రగుదియ, ఏస్కో.

హరి—చిత్తము.

(ఇరువురునిష్క్రమింతురు)

---

రంగము—(కాలకౌశికునిగృహము—చంద్రమతి)

చంద్ర—(తనలో) అక్కటా! ఎంతటిమహారాజుగర్భమునబుట్టిననేమి! ఎట్టిమహారాజును జెట్టబట్టితినేమి, విరించివ్రాలును దాటుట కెవ్వరును సమర్థులుకారుకదా! మున్నెట్టిరీతి విక్రయించినందులకు నాథుం డెంతగావిచారించుచుండెనో, అమ్మహానుభావుఁ డెందున్నవాఁడో! ఇంకనుగాధేయుఁ డాతనియెడల నేమిమాయలబన్నుచుండెనో! సప్తద్వీపముల బాలించుప్రభునకు దేవినైననే నొకరికి దాసినైతినిగదా. సుకుమారశరీరుఁడగు కుమారునకు కడుపునిండ కూటికిగూడ కఱవయ్యెగదా.

(లోహితాస్యుడు తోడిబాలురతోఁ బ్రవేశించును)

చంద్ర—(కుమారునిఁజూచి) నాయనా! రమ్ము. బాలురతో నాడుకొనబోవుచుంటివా?

లోహి—అమ్మా! కాలకౌశికుఁడు నన్ను బాలురతో నరణ్యమునకు కుశసమిత్పుష్పఫలములు గొనితెమ్మనియాజ్ఞాపించినాడు. నేను వీరివెంట నరిగివచ్చెదను.

చంద్రి—(విచారమున)

చ॥ అకటకటా విహీనదయ • నర్భకు నిన్ననుజూచి కాలకౌ
శికునకు రోషభంగిఁ బని • చెప్పఁగ నేగతి విహ్వలాంగివై
నకు నిపు డీవుపోయిన మ • నంబున ధైర్యమునిల్ప నేర్తునే
నికచపయోజతుల్యముఖ! • విభ్రమభానుసమప్రభానిధీ!

అనేక రాకుమారులు నిరంతరము గొలువ విహరించు నీవొక
భూసురుని యాజ్ఞకు బద్ధుఁడవు కావలసివచ్చెనుగదా.

సీ। అనపాయభాగ్య రే • ఖాన్వితమైనట్టి
రాజముఖశిరో • రత్నమునకు
బుట్టెకపాత్రతరం • భోజబాంధవతేజ!
పట్టి నాకేటికిఁ • బుట్టితయ్య
నిమిషార్ధమైనను • నినుబాసి మదిలోనఁ
దాలిమి నిలుపంగ • జాలనేను
వనమునకేగతి • బనుపుదు గాశిక
మాయ నిన్నింకేమి • సేయుగలదొ

తే। గీ॥ యరయ నదియెంతపనియైన • నయ్యెగాని
యోసరిలవచ్చునే మన • కోడయుఁడైన
బ్రాహ్మణుఁడుకోరిచెప్పిన • పనులకెల్ల
బూని వేగంబ యరుగక • మానరాదు.

లోహి—అమ్మా! నీవు భయమందవలదు. వీరితోబోయి సత్వరము
గనే వచ్చెదను.

చంద్రి—(తోడిబాలురనుజూచి) కుమారులారా! లోహితునిజాగ్రత్తగా
దీసికొనిరండు. (కుమారునిజూచి) అరణ్యమున నీ కే
విధమైనభయము గలుగకుండుగాక! (రక్షగట్టి) నాయనా!
యేగిరమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

---

రంగము—అరణ్యము—(లోహితాస్యుఁడు, మఱికొందఱు బాలురు ప్రవేశింతురు)

లోహి—స్నేహితులారా! మీరా రామూలనున్న వృక్షములనెక్కి యాకులఁగోయుఁడు. నేనా కనఁబడు నటవృక్షమెక్కి యాకుల గోసెదను.

బాలు 1—రాకుమారా! నీవేమియుఁ గోయవద్దు నీవిచ్చట నుండుము. సత్వరముగ గావలసినపర్ణముల మేము గ్రహించి తెచ్చెదము.

(కొందఱు బాలురు నిష్క్రమింతురు)

లోహి—ఈ వటవిటపము నెక్కకుండఁగ నేల నిలబడిన నాకులందను. నెమ్మదిగా నాగట్టుపై గాలించి యాకులు కోసెదగాక (వృక్షముకడకరిగి పుట్టపై గాలునిల్పి యాకులు కోయుచుండఁగా సర్పము కఱచును.)

లోహి—హా! స్నేహితులారా! (నేలబడును)

(బాలకులు పరుగెత్తికొని వత్తురు.)

1 బాల—లోహితాస్యా! ఏమిది!

లోహి—వటవృక్షమాకులఁగోయుచుండ నన్నొకసర్పము కఱచినది. విషము తలకెక్కిపోయినది. ఇంక నేను జీవింతునని తోఁచదు. మాయమ్మను జూచుభాగ్యమున్నదో లేదో. మీరు నాయందు దయయుంచి సత్వరముగఁబోయి మాయమ్మకు వార్తఁదెలుపుడు.

2 బాల—అయ్యో! మిత్రమా! పురమునుండి నీతో గలిసివచ్చితిమి. నీవు లేకుండ నెట్లుపోవుదుము.

లోహి — ఇక నేను మాటలాడజాలను. దృష్టికూడ తప్పుచున్నది.

1 బాల — (రెండవవానింజూచి) ఒరే! మనమరిగి యీతని తల్లికిఁ జెప్పుదము. రమ్మా.

(నిష్క్రమింతురు)

---

రంగము — (కాలకౌశికునియిల్లు — చంద్రమతి దుఃఖముతోఁ బ్రవేశించును)

చంద్రి — (లోహితాస్యుని దర్శించి) హా! కుమారా! బాలార్కతేజా! లోహితాస్యా! నన్ను శోకాబ్ధిని ముంచివేసితివా? ఇంక నాకెవ్వరుగలరు? హరిశ్చంద్రుని నెడబాసియు నిన్నుఁజూచుకొని కొంచెము ధైర్యముతో నుంటిని! తండ్రీ! అరణ్యమున నా కా! కోదరము గఱచినప్పుడు నన్నెంతగా తలచి యేడ్చితివో కదా! అయ్యో! నాయనా! ఇట్టిసమయమున నీదగ్గఱనుండుట కైనఁగూడ నోచనయితినిగదా!

(కలహకంఠి ప్రవేశించును)

కల — ఏమే హంసగామినీ! పుత్రుని నెచటికో పంపివేసి యడవిలో పాము గఱచినదని దొంగయేడ్పు లేడ్చుచున్నావా! ఎక్కడికైన నెమ్మదిగా దప్పించుకొనిపోవుటకు జూచుచుంటివా? నీమాయలు నాముందు పనికిరావు. నేను నీకంటె జాణను.

చంద్రి — (దీనయై) తల్లీ! ఇన్నిదినములయినను నాచిత్తవృత్తి నీవు కన్గొనకపోయితివి. అరణ్యమున నాకుమారుఁడు సర్పదష్టుఁడయినాడని ఇక్కడికే తోడిబాలకులువచ్చి చెప్పినారు. అమ్మా! ఈవేళకు నాయందుఁ గరుణింపుము. ఔషధమేమైన దెప్పించి-

బాలునిరక్షించి పుత్రదానము సేయుము. నీకు నమస్కరించె
దను. (పాదములపై బడును)

కల — అడవిలో నాకులు తెమ్మని చెప్పినాము కాని పుట్టలెక్కుమని చెప్పి
తిమా? బ్రాహ్మణులయింట భోజనము చే వానికి గ్రొవ్వుపట్టి
యొడలు తెలియక చరించుచున్నాడు. వానికివలయు శిక్షగావల
సినదే. సరే! యిదియంతయు నాకేల. ఇంట జేయవలసిన పను
లన్నియుం జేసి పిదప నీసుతుని నరయుటకు పొమ్ము రమ్మ.

(నిష్క్రమింతురు.)

---

రంగము — (శ్మశానభూమి — హరిశ్చంద్రుఁడు ప్రవేశించును)

హరి — (తనలో) ఆహా! మునిఋణార్థమై యిల్లాలిని భూసురునకు వి
క్రయించితిని. నేను చండాలునకు దాసుఁడనైతిని. నాపుత్రక
ళత్రంబు లెట్లుండిరో? ఏమి చూచుటకైన నోచనైతిని. ఎన్నఁ
డైన స్వామియాజ్ఞ బొందిపోవుదమన్న చండాలునకు సేవ
యుచున్న నన్నచ్చటికి రానిత్తురు ఎంతయో యాచించినను, వా
రింజూచుటకు దొరవు కానుపింపకయున్నది. కాశీవిశ్వనాథుండు
వారిని నిరంతరము రక్షించుచుండుగాక! ఇప్పుడు శవములు
వహనమున కెవ్వరును దెచ్చుసమయముగాదు కావున నిద్రించెద.

(నిష్క్రమించును)

చంద్ర — (ప్రవేశించి) హా కుమారా! సర్పదష్టుఁడవైన నిన్నుజూచుటకు
వీలులేకుండ బ్రాహ్మణగృహిణి యాజ్ఞాశృంఖలమున నన్ను బం
ధించివేసినది. జగంబంతయు నంధకారమయమ్మై యున్నది. ఆ
బ్రాహ్మణవటుకులు చెప్పినస్థల మిదియే కదా. హా! పుత్రకా!
రాజాధిరాజునకుఁ బుత్రుఁడవై దిక్కులేక యరణ్యమున బడి
తివి కదా. (ఇంచుక నడచి-పరికించి పడియున్న కుమారునిజూచి)

ఉ॥ హాసుకుమార! హావరగుణాకర! హాచిరపుణ్యశీల! హా!
వానరవల్లభప్రికట • వంశమనోహర శుక్తిమౌక్తికా!
హా! సరసీరుహాక్షి సదృ • శాంగవిభాసిత లోహితాస్య! నిన్
గాసి చెరింపనోప నను • గాయగఁ బాడిమె నీకు నక్కటా.
(తొడలపై నిడుకొని)

సీ॥ మొలకనవ్వుల నుండు • ముద్దుల నీమోము
గూర్మి నెట్టింప గ • న్గొనకయున్న
నమృతంబుచిలుకు నీ • విమలవాక్యంబులు
వీనులుచల్లగా • వినకయున్న
సంపూర్ణపూర్ణిమా • శశిబోలునీమేను
చెలువారఁ గౌగిటఁ • జేర్పకున్న
నిరుపమానములైన • నీ చిన్ని చెక్కులు
ప్రేమతోఁగదిసి చుం • బింపకున్న

తే॥ గీ॥ నిమిషమాత్రంబు ప్రాణముల్ • నిలుపజాల
నేను నన్నెంతు నిటబోయి • తే తనూజ!
చేరి నాతోడ నొకమాట • చెప్పవయ్య
పలుమరను నిన్నుఁ బిలువంగఁ • బలుకవేల?

ఉ॥ బాలికలూచుచుం గదిసి • పాడఁగమేడలలోన రత్నశ
య్యాలలితంపుటుయ్యెలల • నైసుఖముండెడు నీవునేడు ని
ట్లేల నరణ్యమధ్యమున • నిర్జనభూమి నిద్రబోయె దా
భీలమృగాలరావములు • పెల్లుగనల్లన నుప్పతిల్లగన్.

హా! వత్సా! నీకిట్టిగతి సంభవించునని యెన్నఁడును తలంప నైతిని. నిర్భాగ్యురాలనగు నాగర్భమునబుట్టి యేపేదరాలిగర్భమున నైన బుట్టియున్నచో నిట్టియకాలమరణమునకుఁ బాత్రుఁడవుగాక యుందువుకదా. (ఇంచుకయూరకుండి) నేనీరీతిని జింతించుచున్నందువలన నేమిలాభమున్నది? నేనే యేడ్వవలయును. నేనే యోదార్చుకో

గీ॥ ఏనుము నా నామధేయంబు • వీరదాసు
నేనలుంగక యుండంగ • నీకు నీవ
నట్టనడురేయి వచ్చి యీ • పట్టిదెచ్చి
యిచట నునుపంగఁ బాడియే • యిగురుబోడి!

నీ వాడుదానవగుటంజేసి [illegible]రించితిని. గాడపేన్న నగినంతస్థలమున కోకమాడయిచ్చి శవమును దహింపవలయును. ఇది నాస్వామి యాజ్ఞ. నీవామాడయిచ్చినగాని కుమారుని దహింపనీయను.

చంద్ర—(తనలో) అక్కటా! ఇప్పుడు నేనేమిచేయుదును! (ప్రకాశముగా)

చ॥ పరహితమార్గవర్తన! శు • భంకర! నన్నొకకొంత నీదయా
సరణి గనుంగొనన్ వలయు • సంకటగిల్లిన దానిబోలె ని
ష్ఠురగతి మాట వేరెఱుఁగ • చూడఁగ నే నిరుపేదరాల, నె
వ్వరు మఱిదిక్కు లేరు తగ • వా! ననుశోకపయోధి ముంపఁగన్.

క॥ శ్రీలుండైవాఱ జలధి
వేలావలయితధరిత్రి • విమలయశుండై
యేలు నృపసూతి యడుగెడు
నేలకుఁ బాత్రిండుగాదె • నీకిటు దగునే?

హరి—(తనలో) ఏమిది! ఈమెపలుకులు నాహృదయమును గలంచుచున్నవి! చిత్తమా! ధైర్యమున నుండుము. (ప్రకాశముగా)

చ॥ కదురు మెఱుంగు నిబ్బరపు • గుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరఁగ నేల యేడ్చెదవు • చెల్వ! దురంతవిషాదవేదనా
విదళితమానసంబునను • వేమఱు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులే విధివి • పాకముదాట దరంబె యేరికిన్.

చంద్ర—మహానుభావా! గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు దుఃఖసాగరమున మునిగియున్న నాకు నివిట్లుచెప్పిన నేమందును! గాధేయమాయ మమ్మీరీతి చేయుచున్నది.

హరి—(తనలో) ఈమె మదీయసతి (ఆలోచించి) తొందరపడకూడదు. పరమేశ్వరా! నాకు దుఃఖము కల్పింపవలదు.

(ప్రకాశముగా)

చ॥ హరపదపూజకుం దొలఁగి • యంత్యజు గొల్చికులాభిమానముల్
నరగునవెచ్చఁబెట్టి హరి • చందనకీర్తులు వీటిబుచ్చి దు
మ్మరమగు నల్లకాటి కధి • కారము వచ్చినదుష్టబుద్ధికిన్
గరుణదలంప నెక్కడిది • గంధగజేంద్రసమానగామినీ!

చ॥ అలికుల వేణి! నీకు చతు • రబ్ధిపరీతమహీతలేశుఁడై
యలరు నృపాలశేఖరుని • యాత్మజుఁడంటివి మున్ను నీవు త
త్కులసతి వింత దైన్యమున • కుం బనిలే దొకమాడమాత్రముల్
గలుగదె నీకు నిట్లు పలు • కందగునే విపరీతవాక్యముల్.

నాస్వామియాజ్ఞ ననుసరించి మాడ నిన్నడుగకతప్పదు. నాకీయలసిన దానిని నీయొడల జాలివహించి విడిచెదను. మాడమాత్రము తెచ్చుకొమ్ము.

చంద్ర—దేవా! నే నసత్యము పలుకుటలేదు. నాయందు గరుణింపుము.

హరి—అబలా! ఇక నే నేమిచెప్పుదును!

తే॥ గీ॥ నీకు మఱియొం డుపాయంబు • లేక యున్న
నెలత మాకిచ్చు మాడకు • సెలవుగాగ
నెమ్మిగైకొనియెద విమ్ము • నీదుకంఠ
సూత్రమునమున్న మినుకైన • శోకముడిగి.

చంద్ర—(తనలో) మదీయగళసూత్రము పరపురుషులకు గోచరముకాదు. ఈతఁడు మన్నాధుడు. (ప్రకాశము) హా! ప్రాణేశ్వరా!

(మూర్ఛిల్లును.)

హరి—హా! సతీమణీ! (మూర్ఛిల్లి లేచును)

చంద్ర—(లేచి)

తే॥ గీ॥ ఓ హరిశ్చంద్ర నీపుత్రు • లోహితాస్యు
జేరిచూడుము మున్ను నీ • యూరుపీఠి
నిద్రజెందిన కైవడి • నేడు దీర్ఘ
నిద్రబోవుచున్న ని • ర్నిద్రతేజ.

సీ॥ పృథుశిలాస్తంభసం • భృతమైన యీ మంచె
నవరత్నసింహాస • నంబె నీకు
నరశిరఃకఠినబం • ధురకపాలంబులు
మంగళాచారకుం • భములె నీకు
శూలాగ్రమానవ • స్థూలకేశంబులు
రమణీయమగు చామ • రములె నీకు
భూతభేతాళ జం • బుకనినాదంబులు
కవిగాయక ప్రసం • గములె నీకు
సురుచరిత్ర మహాశ్మశా • నోపకంఠ
శాకినీలోకభయద శ్మ • శాన భూమి
సకలరాజ్యరమ నివా • సంబె నీకు
సత్యగుణసంపదభిరామ • సార్వభౌమ!

సీ॥ గుమిగూడియున్న యీ • కొఱవిదయ్యంబులు
పంజులవారలె • పార్థివేంద్ర
దారుణభైరవ • ధ్వానకంచుకివ్రాత
సాంద్రహుంకారమే • సార్వభౌమ
ప్రీతిఁ జేరిభజించు • భేతాళనివహంబు
మంత్రిసందోహమే • మనుజనాథ
సందడిసేయు పి • శాచులు నుడిగంపు
టతివలె భానుకు • లావతంస
రుద్రభూమి యయోధ్యయే • భద్రమూర్తి
మంచె సింహాసనమె జగ • న్మాన్యవీర్య

తోడరి దైవంబు నేమని • దూరుదాన
గటకటా యోహరిశ్చంద్ర • కాంతిచంద్ర

నీరాజ్యపరిపాలనా వైభవంబంతయు నేమైనది! తుదకు భగవంతుఁడు నిన్ను గాటికాపరిగఁ జేసినాడా? నిన్నిట్టిస్థితిలోఁ జూచుచున్న నాకన్నులు కాలిపోవకయున్నవి.

హరి—(లోహితాస్యునిఁజేరి) హా! కుమారా! నీయాటపాటల జూచి యానందించు భాగ్య మంతరించినది. యుక్తవయస్కుఁడవైనపిదప నిన్ను సింహాసనాసీనుం జేసి సుఖానంద దలంచిన నాకోరిక యంతరించినది. అయ్యో! తండ్రీ!

చంద్ర—నాథా! మనమిద్దరమును నీగతి ధృతిదూలి శోకించుచున్నచో బ్రయోజనము లేదు. తెల్లవారినచో నేనుగృహంబున కరుగకున్న బ్రాహ్మణి కాగ్రహముగలుగును. సుజ్ఞానసితాసిచే తనయ మోహలతను ద్రెంపి, మాడదెచ్చుటకు నాకానతీయుఁడు.

హరి—నే నీ కుమారునొద్దనుండెదను. నీవు సత్వరముగఁబోయి మీ యజమానురాలి నడిగి మాడదెమ్ము.

చంద్ర—(నిష్క్ర)

హరి—(కుమారునిఁజూచి) హా! కుమారా! నాగర్భమునఁబుట్టినందు వలనగదా నీవిట్లయితివి. (ఎదుటఁజూచి) అదియేమి! ఎవరో రాజభటులు స్త్రీనిఁగొని వచ్చుచున్నారు.

(భీషణుఁడు—చంద్రమతితోఁ బ్రవేశించును)

భీష—ఓయి వీరదాసా! ఈకాంత రాజమందిరముఁజొచ్చి రాకుమారునివధించి భూషణము లపహరించి భటులచేఁ బట్టుకొనఁబడినది. రాజీమెకు శిరచ్ఛేదము విధించినాడు. వీరదానునికడకుఁ గొనిపోవ, యాతఁడు నీకీకార్యము నివర్తింపుమని యాజ్ఞ

యిచ్చినాడు. బాలఘాతినియగు నీతన్విశిరంబు ఖండింపుము. నేబోయెద. (నిష్క్రమించును)

హరి—హా! ఏమిది! చంద్రమతియేనా! హా! చంద్రమతీ!

చంద్ర—నాథా! నేనేమిచెప్పుదును! మాడక్కై పోవుచుండగా నెవ్వరో. చోరులు నాయొడిలో నగలు కొన్నిపడవైచి యిదిగో బాలకహంతియని రక్షకభటులచేఁ బట్టించిరి. ఇంతకుదప్ప మఱేమియు నెఱుంగ.

చ॥ అరసి రణాంగణంబునఁ ద్ర • ణాంకురసంగతవక్త్రిలన్ భయా
కరమతులన్ నిరాయుధుల • గర్వము సర్వము నుజ్జగించుచున్
శరణము వేఁడు వైరులను • సారకృపామతి బ్రోచు నేను ని
ష్కరుణ కృపాణధార గుల • కాంతవధింపగ నెట్లుబూనుదున్!

చంద్ర—నాథా! మీరు చింతింపవలదు. స్వామికార్యమును నిర్వర్తించుఁడు. రాకుమారుని జంపెనను నింద భరింపఁజాల.

తే॥ గీ॥ మానవులు దేవతలు వి • స్మయమునొంద
నిచట నచటను బొగడ మ • హీతలేశ!
శంక బొందక మిగుల ని • శ్చలత నిలిచి
తెంపుమీఱక ద్రెంపు మ • దీయశిరము.

హరి—రమణీ! ధైర్యమువహించితిని. నీవు నిశ్చలచిత్తమున భగవంతునిధ్యానించి ఖడ్గమునకు శిరముపట్టుము.

చంద్ర—పరమేశ్వరా! నాకు జన్మజన్మములకును హరిశ్చంద్రసార్వభౌమునే పతిగాఁజేయుము నాథా! ఇకవధింపుఁడు.

(తలవంచును.)

హరి—(కంఠమును ఖండింపఁబోవును.)

విశ్వా—(త్వరగా బ్రవేశించి హరిశ్చంద్రునిఁ జేయిబట్టుకొని) రాజా ఈయవివేకమేమి? స్త్రీహత్యాపాతకమునఁ గొడిగట్టుకొనఁదలఁచితివా? సూర్యకులమునఁ బుట్టి యకార్యమునకు సాహసించితివా? చాలు. చాలు. ఇటువినుము. నామాతంగకన్యలను వరింపుము. నీకు సకలశుభములు కలుగును.

హ—మునీంద్రా! మీకెదిరి యెవ్వరును మాటాడజాలరు. నాచిత్తమునేల పరిశోధించెదరు? మీరిటిసలమునను డరాదు. నాచిత్తమెప్పుడు నధర్మమునఁ బ్రవర్తింపదని యెఱుఁగుఁడు. చేతిఖడ్గము విడువుఁడు.

విశ్వా—ఏమీ! మేము చెప్ప నీమాట వినవవా! పోనిమ్ము. (ఈవలకు వచ్చి తనలో) సత్యగుణమూర్తియనగా నితఁడే!

హరి—చంద్రమతీ! సిద్ధముగానుండుము

(మరల ఖండించుటకు జూచును)

విశ్వా—(బిగ్గఱగ) ఓవిశ్వేశ్వరా! ఉమారమణా! హరిశ్చంద్రుఁడు తనయాలిని ఖండించుచున్నాఁడు. నేచెప్పిన వినఁడు. నీవు వచ్చి వారింపుము.

(పరమేశ్వరుఁడు ప్రవేశించును)

పర—(హరిశ్చంద్రునిఁజూచి) హరిశ్చంద్రా! ఆగుము.

ఉ॥ భూపకులాగ్రగణ్య! నిను • బోలునృపాలురు లేరు చూడఁగా
నీపదునాల్గులోకముల • నెంతయు మేలు నితాంతసూనృతా
లాపవిశేషధైర్యగుణలక్షణ • సాహసవైభవక్రియా
దీపితమయ్యె నీనడత • దివ్యమునీశ్వరవర్ణనీయమై.

హరి— } పరమేశ్వరా! మావందనము లందుకొనుము.
చంద్ర—

పర—విశ్వామిత్రుని ప్రతిజ్ఞకు భంగమైనది.

మ॥ ఇది గాథేయు మహేంద్రజాలము ధరి • త్రీశా! సమస్తంబు నా
త్మద యొప్పన్ వినిపించెదన్ వినుము యు • ష్మత్సూనృతాలాపనం
పదమెల్లం దెలియంగఁ గోరి చలముం • బంతంబు రెట్టించి యి
ట్టిదశం గుందఁగ జేసె మౌని తన కా • టిల్యంబు పాటిల్లఁగన్.

సీ॥ ఇది ప్రేతభూమిగా • దినకులేశ్వర! పావ
నంబగు యజ్ఞవా • టంబుగాని
యస్థిపోత్రులును గా • వమితసూనృతవచ
స్సౌభాగ్య! బహుసమి • త్సమితిగాని
ఘనకపాలములుగా • వనవద్యసాహస!
విమలోపకరణ పా • త్రములుగాని
రక్తపూరము గాదు • రాజన్యలోకైక
నాథ! హయ్యంగవీ • నంబుగాని

గీ॥ గడిదికొఱ్ఱులు గావు సం • గరజయాంక!
పాదుకొల్పినభూరియూ • పములుగాని
చికురజాలంబుగాదు శి • క్షితసమస్త
విమతనరపాల! నవకుశ • వితతిగాని.

వీరబాహుఁడు కృతాంతుఁడనియు, కాలకౌశికుఁడు కలిపురుషుం డనియు దలంపుము. కాశీరాజపుత్రుఁడు సజీవుఁడైనాఁడు. నీకుమారుఁడు గూడ లేవగలఁడు.

లోహి—(నిద్రలేచినవిధమున లేచును)

చంద్ర—నాయనా! ఇటురమ్ము.

విశ్వా—రాజేంద్రా! నీసత్యమును బరీక్షింపఁగోరి నిన్ను గడుబాధల బెట్టితిని. అవి మఱచిపొమ్ము.

హరి—దేవా! తమరు నాకుకీర్తి ఘటిల్లఁజేయుట కట్లు జేసితిరి.

విశ్వా—నృపాలా! వసిష్ఠునితో నొనర్చిన శపథము భంగమైనది. ఇంక నీవు పురంబునకరిగి రాజ్యమేలుకొనుము.

హరి.—మహాత్మా! తమకర్పించిన రాజ్యము మరల స్వీకరింపజాల. మీ యిష్టమువచ్చినవారి కిండు. చంద్రశేఖర భక్తుడనై చరింతును.

విశ్వా.—నీవే నాకిష్టుఁడవు. నీకే యిచ్చెద. మారుపలుకవలదు. పదునాల్గుయుగంబులు భూమినేలించి పిదప నిం ద్రనియాసనంబున జతుర్దశమహామన్వంతరములు నిలిపెదనని దేవసభామధ్యమున బ్రతిజ్ఞఁజేసితి. అట్లగుగాక!

పరమేశ్వరుఁడు.—తథాస్తు! తథాస్తు!

(అందరు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

సర్వము సంపూర్ణము.





# సత్యహరిశ్చంద్ర

## అనుబంధము

### 1. విశ్వామిత్రుఁడు.

చాలు చాలు నో వసిష్ఠా !
యీలీల-భూపాలు-సత్యశీలునా-బలికెదవు॥ చా॥
భూపతులెక్కడ ! సత్యాలాపములెక్కడ-
పాపులు - కపటచిత్తులు - మాకెఱుక లేదా॥చా॥

### 2 వసిష్ఠుఁడు.

తగునా యిటు బల్కగ కౌశిక! వినుమా -
జగతిపైనా - ధరణీశుబోలు - సత్యనిరతుఁడెందు లేఁడుగా ॥ త ॥
తన సతి బాసిన - తనయుండీల్గిన -
ఘనరాజ్యముపోయిన - జనపతి - మృషలాడఁడు గనుమా ॥త॥

### 3. హరిశ్చంద్రుఁడు.

మునివర రమ్మా ! పీఠంబిదె కొమ్మా ॥
పావనచరితులు - పరమతపోధనులు - మీ యెడఁ
బ్రేమంబున - జనుదెంచితిరి ॥ము॥
మీ కార్యంబెట్టిదైన-జేకొని శిరమున గావించెద నానతీయుఁడిక ॥

## 4. లోహితాస్యుడు.

బంగారూ లేడి - యదిగో - చూడు ॥

దానితోడితెమ్మా - తండ్రీ యింక - గూడియాడెద॥ బం॥

వన్నెచిన్నెలమెకము - బల్ వన్నెసొంపునింపుచున్నది

నన్ను - మన్నించి - ముద్దు - చెల్లింపుము॥ బం॥

## 5. మాతంగకన్యలు.

హే హరిశ్చంద్రభూపాలా - సకలసద్గుణజాల -

ప్రకటితయశోవిశాలా ॥

మమ్ము సమ్మదమున గృపజూడుము - గానంబుననిధులము ॥హే॥

## 6. మాతంగకన్యలు.

మదనుఁడవు గాదె - పదనుశరములు - హృదయమున నాటుచుండగ -

యెదురుగ మము నీబిగికౌగిట జేరిచి, మోదమునిడు భూవర॥ మ॥

సరసుఁడవని - జనములు పలుకగ - నిను కామించి

వరింపగ జనుదెంచితిమి॥ మ॥

## 7. హరిశ్చంద్రుడు.

ఛీ - పొండు మాలెతలారా!

కండకావరమడగించెదర - ఖండిగను యీగతి -

భూమండలనాథుని నను గండతనమున - గోరెదరే॥ ఛీ॥

వెలివాడయువతుల్ - ఛీ -

భాషింప ననర్హుల్ - కాని శమియించితి॥ ఛీ॥

## 8. మాతంగులు.

కొట్టెదవా - తిట్టెదవా - యిటు రట్టుపెట్టెదవా!

గట్టివాడవని - గుట్టుదెలిపి - నీపట్టున జేరగ

యాశించిటు లేతేరగ॥ కొ॥

9. విశ్వామిత్రుడు.

ఇంత కావరమా - భూకాంత నీ॥

కాంతల్ - సుగుణదాంతుల్ - జితరతీకాంతల్,

నాపతీర్థమణులు దండించితి॥ వి॥

ఆశ్రమహరిణంబును దునిమినయందుకె

సైరించితి - నిపుడీ తెరగున జేసి మదీయ

కోపము సకు - పాత్రుడవైతి॥ వి॥

10. హరిశ్చంద్రుడు.

అపరాధముక్షమియించుచు కృపగనుమా - మునివరా - నా॥ య॥

తనయు డజ్ఞానియై - యొనరించెదు దోషంబుల

జనకులు మన్నింతురుగా • కృపగందుసు - అ॥

11. విశ్వామిత్రుడు.

వరింపుమా - మాతంగుల॥ వ।

వరించిసుఖంబుల నిరంతరంబుగాంచుమా॥ వ॥

తిలకింపుమా - నీజనకువిషయమట్లు -

బొందితోడ నిన్ను - జంభాపురికంపద॥ వ॥

12. హరిశ్చంద్రుడు

వలదు వలదు నాకిది మునివరా॥

కృపకనుమా - మనవివినుమా - యఘుము మునిగనుమా॥ వ॥

13. 14.

విశ్వా—ఆడినమాటను తప్పక రాజ్యంబిమ్ముమా ..

పాడిదప్పిన పాపముగలుగును॥ అ॥

హరి—మునివర యిదెగొనుమా -

మనమున సందేహ మిసుమంతయు లేదు॥

విశ్వా టదాకను మిూరేలిన భూమికదా -
కోర్కె జనించిన గైకొండిక॥ ము॥
విశ్వా— ఈమాటలు ఈయాటలు సాగవిచట -
చెప్పినభంగిని - చేయుము తప్పక - ॥ఆ॥

15. హరిశ్చంద్రుడు.

పూర్ణచంద్రబింబసమవదన! మరాళి - గమనా॥ పూ॥
నాకతమునసీకీకష్టము కలిగెనుగా॥ పూ॥
విధికృతమున కేమనివగతును - సర్వసంపదలు
బాసి యిట్లులైతిమి కా॥

16. చంద్రమతి.

చింతింపనేల భూకాంతనీవు॥
అంతరాత్మనెపుడు - సత్యముపై నిలిపిన
మాకు వంతలేమిసేయు॥ చి॥

17. నక్షత్రకుడు.

ఏమి! నృపతీ - మాటాడవు - సుకృతీ॥
ఈమొయి యీపురిజేరితిమిల
దివసంబులురెండేగద గడవు ఏ॥
ఈసరికొాక కానయిననుజేవ్వు
లాశికుబుగా మేతిదీరును। ఏ।



కాకినాడ ఆల్బర్టుపవర్ ప్రింటింగ్ వర్క్సు యందు ముద్రింపబడియె 1926.